# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 | రాజమహేంద్రవరము 1-3-1979 | సంచిక 9




—* ఈ సంచికలో *—



16—3—79 సంచికలో పురుషార్థ సుధానిధి - పతివ్రతా ధర్మములు, శ్రీశ్రీ ప్రకృతి గీతములు - ఒక పరిశీలనము, కవి కళాదులు మొదలగునవి ఉంటాయి.


—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# ప్రబంధాల్లో పద్యశిల్పం

— శ్రీ కపిలవాయి లింగమూర్తి

కవితా లక్షణాలలో యతిప్రాసల లాగే వృత్తరచనగూడా ఓ ప్రత్యేకత నిలబెట్టుకొంది. క్షేమేంద్రుడు సువృత్త తిలకంలో నిర్దోషం గుణయుక్తం అయిన వృత్తాలు యథాస్థానంలో నివేశితములైనపుడు ఆ కావ్యం ముక్తాహారంవలె శోభిస్తుందని చెప్పాడు. లాక్షణికులు సంస్కృతంలో శాస్త్రరచన కనుష్టుప్పు, శృంగారవర్ణన కుపజాతి చంద్రోదయాదులకు రథోద్ధతం, షాడ్గుణ్య ప్రయోగాలకు వంశస్థం, వీరరౌద్రరసాలకు వసంత తిలకం, సాక్షేప క్రోధ ధిక్కారాలకు పృథ్వి ఔదార్యరుచిరత్వాలకు హరిణి, ప్రావృట్ప్రవాసాలకు మందాక్రాంత శౌర్యస్తవాలకు, శార్దూలం, సావేగాదులకు స్రగ్ధర, ఉపపన్నపరిచ్ఛేదాలకు శిఖరిణి, సర్గాంతాలకు మాలిని, ముక్తకాలకు తోదక తోటకనర్కుటాలు, అనుకూలములని అంగీకరించారు కాని తెలుగువారీ వృత్తాలేవీ గ్రహించలేదు. వారు కృత్యాదులకు శార్దూలం, షష్ఠ్యంతాలకు కందం, దీర్ఘవివరాలకు సీసం, నీతులకు కందగీతాలు, స్తుతులకు మార్ణికాదండకాలు, యుద్ధాలకు స్రగ్ధర, అరణ్యాలకు వచనం, పుష్పాపచయాలకు రగడ, ఆశ్వాసాంతాలకు మాలినీభుజంగప్రయాతాలు, ఫలశ్రుతికి మంగళమహాశ్రీ, స్వీయవివరాలకు గద్య, కర్తృకాది కథనాలకు చక్రశైలబంధాదులు, విషయవివరణకు చంపకోత్పలాదులు గ్రహించారు. ఇది నేటి తెలుగు ప్రబంధస్వరూపం.

మన కేసందర్భాని కేపద్యం రాయాలనేదానికి శాస్త్రమున్నా అది శాసనం మాత్రం కాలేదు. సందర్భోచితపద్య రచన ఆయాకవుల ప్రతిభపైనే ఆధారపడి నిలిచింది. అంతేకాక మనవారు రూపొందించిన ప్రబంధ స్వరూపంలో దేశిమార్గకవితలకే కాక యించుమించు చతుర్విధకవితలకుగూడా సముచిత స్థానం లభించింది.

తెలుగువారికి పద్యరచన సుమారు వెయ్యిన్నగయేండ్లపంట. సంస్కృతంలో వృత్తసంపద అశేషంగా ఉన్నా వారందులో నుంచి మత్తేభశార్దూలాలు దప్ప తక్కినవేవీ ముట్టక దేశీయచ్ఛందంలోని చంపకం, ఉత్పలం, కందం, గీతం, సీసం, అనే పరిమితమైన పద్యాలతోనే తమ అపరిమిత కవితాశిల్పాన్ని ప్రదర్శించారు.

ఆంధ్రమహాభారతంలోని నన్నయగారి అనువాదంలో సంస్కృతం పాలెక్కువైతే తిక్కనగారిలో తెలుగుపాలెక్కువ. ఈ సత్యాన్ని వారు తమరచనల్లో మొదటనే చాటినారా అన్నట్లు "శ్రీవాణీ గిరిజా శ్చిరాయ' అని నన్నయగారు సంస్కృతవృత్తంతో ఆరంభిస్తే 'శ్రీయన గౌరినా బరగు' అని తిక్కనగారు తెలుగుపద్యంతో ఆరంభించాడు.

నన్నెచోడుని కుమారసంభవము స్కంధుని కథ కాబట్టి అతడందులో స్కంధశబ్దభవములైన కందాలెక్కువగా ఉపయోగించాడు. భాగవతంలోని గజేంద్రమోక్షణఘట్టంలో కథాస్థానం సరోవరం గాబట్టి పోతనగారక్కడ చంపకాలకు స్థానం కలిగించలేదు. వామన చరిత్ర గూడా అదేస్కంధంలో ఉంటుంది. దానిలోనిపద్యాల్లో కందాలు మొదటిస్థానం, సీసాలు ద్వితీయస్థానం ఆక్రమించి వామనుడు పుట్టుకతో పొట్టి మెట్టుకతో జెట్టి అనే విషయాన్ని సూచిస్తాయి. పారిజాతాపహరణంలో అలకపానుపెక్కిన సత్య, ఆమె నోదార్చటానికి వచ్చిన శ్రీకృష్ణుడు గంధానవేస్తే పుష్పాన వేసికొన్నారేగాని, ఒకరిపై కొకరు అంకుశాలుగాని అసుగాలుగాని యెత్తుకోలేదు.

ఎఱ్ఱన అంటె అరుణుడు కాబట్టి తెలుగుభారతంలో ఆయన రచన స్ఫురదరుణాంశు అనేపద్యంతో ఆరంభమయింది. పోత మంటె ఏనుగుగున్న. పేరుకు తగినట్లు పోతనగారి కవితాకన్య మత్తేభగమనంలోనే యెక్కువగా నడిచింది. ప్రజాకవి వేమన సరాగవిరాగజీవితాలు రెంటిలోనూ ఆటవెలదినే ప్రేమించాడు.

నాగులు భోగులు గాబట్టి నన్నయగారు సర్పరాజప్రసన్నతకు చంపకోత్పలాలు గ్రహిస్తే శివుడు గజవ్యాఘ్రాజినధారి గాబట్టి ధూర్జటి అతనినుతికి శార్దూల మత్తేభాలు గ్రహించాడు. సరస్వతి మహోత్పలాసీన గాబట్టి, ఆదేవిస్తుతి కెఱ్ఱన పోతనలు అంబనవాంబుజోజ్జ్వల – క్షోణి తలంబునన్ –'అని ఉత్పలాలు గ్రహించారు. తిరుపతికవులుగూడా ఆత్మకూరులో సరస్వతీదేవిస్తుతి కుత్పలాన్నే గ్రహించారు. ఈలాటి ఛందోవిశేషాలెన్నో మన కాంధ్రకావ్యప్రపంచంలో కనిపిస్తాయి.

ఇక ఈ ప్రబంధాలను ప్రకరణాలను విడిచి కథల్లోకి ప్రవేశించినపుడు కీచకుని మాటలు వినగానే ద్రౌపది పులియైపోయింది. ఉత్తరగోగ్రహణసందర్భంలో ఫల్గునుడు కౌరవులపైకి సింగంలాగా వెళ్ళాడు. భటునితో స్మరకళాసంగరంలో మునిగిన వృషలిని జూచినపుడజామిళునిచిత్తం, చెరలో తమకు కలిగిన బాలకృష్ణుని చూచుకొన్నపుడు దేవకీవసుదేవుల మనస్సు 'తరల' మైపోయింది. శ్రీకృష్ణునికొఱకు పూతన

'మానిని'యై బయలుదేరింది. గజేంద్రుడీశ్వరుని 'ఓకమలాక్ష ! యోవరద' అని శరణాగతి పొంది ఆస్వామికి తనమనః కమలాన్ని సమర్పించాడు. కీచకుని దౌష్ట్యం చూడగానే భీముడు బ్రహ్మాండభాండం పగలవేసే అంతగా పెరిగిపోయాడు. ఈలాటి యపూర్వవిషయాలెన్నో మనకవులు తాము చేపట్టిన వృత్తాలద్వారా నిరూపించారు.

మనుచరిత్రలో పెద్దనగారు వరూథినీ వీక్షణవ్యాపారాన్ని చెబుతూ 'అబ్బురపాటుతోడ-చూచి ఝుళంఝుళత్కటక సూచిత-తొంగలిరెప్పలన్ దొలగద్రోయుచు' అని నేత్రోపమానాలైన ఉత్పలాలను, 'మునుమున్ బుట్టెడుకొంకు,-అని మేషస్థితి మాన్పె - అని చింతించుచు, అని యామె ఉన్మత్తావస్థను చెబుతూ మత్తేభాలను, 'ఎక్కడివాడో యక్షతనయేందు జయంత వసంత కంతులన్ జక్కదనంబునన్ గెలువజాలెడివాడు,' అని ప్రవరునిగని వరూథిని మరుబారికిజిక్కినపు డతనిశరమైన ఉత్పలాన్ని, ప్రవరుడామెను 'ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ!' అని వీక్షణాలను జూచి సంబోధించినపుడు, 'ఇంతలుకన్నులుండ తెరు వెవ్వరి వేడెదు!' అని వరూథిని అతనికన్నులను జూచి ఆశ్చర్యపోతూ సమాధానించినపుడు మరల వాని ఉపమానాలైన ఉత్పలాలను గ్రహించి, ఈవిధంగా పెద్ద వృత్తశిల్పాన్ని ప్రదర్శించాడు.

సంస్కృతలాక్షణికులు సాక్షేప క్రోధ ధిక్కారాలకు పృథ్వీవృత్తాన్ని శౌర్యస్తవాలకు శార్దూలాన్ని చెప్పారు. గాని తెలుగువారాలా కాక సామీచ్యాన్ని లేదా నడకనుబట్టి గావచ్చు ఆక్షేపక్రోధధిక్కారాలకు శార్దూల మత్తేభాలు గ్రహించారు. ఈ నియమం మనుచరిత్రలో 'ఎండే డెందము గందళించు' అని వరూథిని ప్రశ్నించినపుడు, ప్రవరుడు, ఈపాండిత్యము నీకు దక్క-మరి యెందే గంటిమే - తరుణీ రేపును మాపు హవ్యములచేతన్ తృప్తుడౌవహ్ని అని సమాధానించినపుడు చూడవచ్చు. పాండురంగమాహాత్మ్యంలో నిగమశర్మను మందలించే అపు డతని యక్కగారు కూడా యిదేపద్ధతి నవలంబించినట్లు 'వీరావేశము దాల్చి-లోలత్వంబున మత్తకాశినుల కిట్లున్, మున్నగు పద్యాలను బట్టి తెలుస్తుంది.

వరూథిని ప్రవరుని ప్రాంచద్భూషణ బాహుమూలరుచితో కాగలించింది. పెద్దనగారీసందర్భంలో శార్దూలాన్నెత్తుకొన్నాడు. ఆయన వాడిన వృత్తాలింత వరకు జూపినవి ఆయాసన్నివేశాలకు పోషకాలనుకుంటె ప్రాంచత్తనిరేఫ సంయోగంతో దీర్ఘంతో, బిందుపరకంగా ఆరంభమైన ఈపద్యం ప్రవరుని పాలిట కాకౌగిలి గాండ్రుమని యేదో ఆడుపులి పైబడినట్లుండే తప్ప అందులో సరసత లేదని తెలుపుతుంది. ప్రవరు డంతవరకే ఆమె ప్రాజకువులవాదంతో వెగటుగొన్నాడు గాబట్టి వరూథినియొక్క ఈచేష్ట దానికి మరింత దోహదం చేసి ఉంటుంది. పెద్దనగారిక్కడ ప్రవరుని నైష్ఠికత ననన్యసామాన్యరీతిలో కాపాడినాడు.

ప్రవరు డంబురుహగర్భ కులాభరణం గాబట్టి అతని పరిచయానికి పెద్దనగారు, 'అపురి బాయకుండు మకరాంకశశాంక మనోజ్ఞమూర్తి అని ఉత్పలాన్ని గ్రహిస్తే తెనాలి నిగమశర్మను 'వనితామానససూనసాయకుడు' అని యావనోన్మత్తుడు గాబట్టి మత్తేభాన్నెక్కించాడు. పెద్దన ప్రవరుని జూచిన జారకామినులను (ఆటవెలదులను చెప్పటానికి 'వాని,చక్కదనము వైరాగ్యమునఁ జేసి' అని ఆటవెలది నెత్తుకుంటే తెనాలికాపు కోడలిని జూపటాని కామెలో ఓవికారం (కలదు) ఉంది గాబట్టి కందాన్నెత్తుకొన్నాడు.

ఆమె నిగమశర్మ వెంబడి వెళ్ళేఅపుడు 'ఆకుమరుంగుపిందె' యని ఉత్పలంలో చెప్పాడు. ఈ పిందె రాకాకుముద ప్రియాస్య. కుముదశబ్దం యిక్కడ ఈ కాపుపడతి నీచాభిరతిని సూచించటమే కాక, ఉత్పలవాచకంగూడ కాబట్టి ఈ వృత్తం ఈ సన్నివేశానికెంతో ఔచిత్యాన్ని తెచ్చిపెట్టింది. పద్యం పేరు పద్యంలోనే యిమిడిస్తే దాన్ని ముద్రాలంకార మంటారు. అయితే యిందులో కుముదశబ్దం ఉత్పలపర్యాయవాచి కాబట్టి యిది గూఢముద్ర. గజేంద్ర మోక్షణ కథలో 'కలభంబుల్' సెరలాడు, ఇభలోకేంద్రుడు హస్తరంధ్రమున, తమమున్ బాసిన రోహిణీవిభుక్రియన్, అని ఈలాటి గూఢ ముద్రాలంకారాలు కనిపిస్తాయి. ఈలాటివింకా మన కావ్యాల్లో చాలా ఉన్నాయి.

ఇక పాండురంగ మాహాత్మ్యం లోని ఉత్పలం మత్తేభం చేతిలో పడి వెడుతున్నపుడు 'ఎదలో నాకలిదప్పియున్ రవికరాత్రియునెన్నదు' అని తెనాలి యెంత చెప్పినప్పటికీ రవికరాత్రికి ఉత్పలం పొందేస్థితి ఆకాపుకోడలి పరిస్థితిని మనకు తెలుపుతూనే ఉంటుంది.

ఈకాపుకోడలిపూర్వాశ్రమదాంపత్యం చాలా చిత్రమయింది. భర్త అద్దమరేయి దాకా పొల మారసి యింటికివచ్చి మారశిలీముఖాహతితో వేగిపోతుంటాడు. అపుడాముద్దియ వానిప్రక్కనే ఉన్నా ఓసేవ చేయదు, ఓముచ్చటాడదు. తానుకన్నులు మూసి మనసులో తోచే చెలువుని మోచుకొంటూ పడుకుని ఉంటుంది. ఈవిధంగా పాపం ! ఈదంపతుల్లో ఒకరు కరుణాపాత్రులైతే మరొకరు తదాభాసపాత్రులు; అయినా యిద్దరూ మారశిలీముఖాహతులే కాబట్టి తెనాలియిక్కడ మన్మథబాణమైన ఉత్పలాన్ని ఉపయోగించి చక్కని ఔచిత్యాన్ని చూపాడు. మన కావ్యాలను సమగ్రంగా పరిశీస్తూ పోతే ఈలాటి వెన్నో వృత్తవిశేషాలు బయట

## వేదన

శ్రీ గాణి శివశంకరశర్మ.

దూరతీరాన కననగు నేరుజూచి
పరుగుతీసితి ప్రేమాఽబ్జసర మటంచు.
ఎండమావిగ తుద కద్దియెఱుకయయ్యె
ఇంతలోన నాజీవిత మంత మయ్యె.
సుందరీ ! నిన్ను గోరను సుంతయైన
నీదు సౌందర్యగరిమను నేనుగోర
నాదుబాధామయచరిత్ర యాదరమున
వినుచు కన్నీరు విడుచులే విందు నాకు
కనుల నిలుపగ బాష్పముల్ గానరావు
గుండెమంటల సెగలలో నెండిపోయె.

---

( 2 వ పేజీ తరువాయి )

పడతాయి. ఆధునికులైన తిరుపతికవుల్లో గూడా ఈవిశేషం మనకు కనిపిస్తుంది. వారాత్మకూరులో తమకు కలిగిన గజోత్సవాన్ని ప్రభువునకు చెబుతూ'కరి నెక్కించితి వృత్తి నిచ్చితి' అని మత్తేభాన్నే యెత్తుకొన్నారు.

భవభూతి మహర్షులవాక్కును అర్థం తనంతట తానే అనుసరిస్తుందని చెప్పాడు. లాక్షణికుల మతం ప్రకారం కవిగూడా ఒకఋషి. కవిత్వమనేది ఓసదావేశం గాబట్టి ఆ ఆవేశంలో అతని నోటివెంట వెలువడే కవిత్వాన్ని వాక్యాన్ని అర్థంవలె అవసరమైన ఛందస్సుగూడా తనంతట తానే అనుసరిస్తుంది. ఈ అనుసరణం మనకందరిలో గాకున్నా ప్రతిభావంతుల్లో తప్పక కనిపిస్తుంది. దాన్ని వ్యాసంలో స్థాలీపులాకన్యాయంగా కొంత చూపాను.

—:0:—

## ద్రౌపది - ధర్మాద్వైతస్థితి

( కీచకవధ ఘట్టము )

— శ్రీ ఎమ్. కృష్ణస్వామి, ఎం. ఏ.

---

సామాన్యముగా పతిని అణకువ గలిగి సేవించు స్త్రీ మూర్తిని పతివ్రత యని పిలుచుచుండుట మనకలవాటు. పాతివ్రత్యము: దొసగులతో సంబంధము లేకుండ భర్తను పూజించుచు అతని యాజ్ఞను అక్షరములా నెరవేర్చుట, అత్తమామలు ఆరడి పెట్టినను కిమ్మనకుండుట, మొదలైనవి పతివ్రతా లక్షణము లని మనభావన.

ద్రౌపది పతివ్రత యని మనందరి హృదయములు ఒప్పుకొనును. కాని మన మనస్సులు మాత్రము అప్పుడప్పుడు అనుమానము వ్యక్తము చేయుచుండును. ఎందువల్ల ననగా మనము చెప్పుకొను పతివ్రతాలక్షణములు స్థూలదృష్టికి ద్రౌపదిలో లేనట్లు కనిపించును. మొదటిది పాతివ్రత్యవిషయము. ద్రౌపది దాంపత్యము లోకాచారమునకు విరుద్ధమైనది. ఈమెకు ఐదుగురు పతులు. ఐదుగురు పతులు గల భార్య పతివ్రత యెట్లగునో సామాన్యదృష్టికి బోధపడదు. మనకే కాదు. ద్రౌపది తండ్రియైన ద్రుపదమహారాజుకే బోధపడలేదు. ఈమెను మాకయిదుగురకు ఇచ్చి చేయుమని ధర్మజుడు చెప్పగా ద్రుపదుడు అదరిపడినాడు. ధర్మజుడు ధర్మము తప్ప వేరుపలుకడని అతనికి తెలియును. కాని ఐదుగురు భర్తలను కలిగియుండుట ఎట్లు ధర్మమగునని అతని మనస్సు మథన పడినది. అప్పుడు వేదవ్యాసుడు దిగివచ్చి ధర్మజుని పలుకు ధర్మమే యని చెప్పి, లోనికి తీసుకొని వెళ్ళి, ఏకాంతమున ద్రౌపది యొక్క పూర్వజన్మ వృత్తాంతమును వివరించినాడు. అంతేకాక పూర్వపు జన్మలోని పాండవులయు ద్రౌపదియొక్కయు రూపములను కూడ దర్శింపజేసినాడు. శివుని గూర్చి తపస్సు చేసిన ద్రౌపది అతడు ప్రత్యక్షమై నీకేమికావలె నని కోరగా 'పతి. పతి, పతి, పతి, పతి, యని అయిదుసారులు అనినది. అట్లే నీకయిదుగురు పతు లగుదు రని అతడు వరమిచ్చినాడు. ఒప్పు తెలిసిన ద్రౌపది'స్వామీ'! ఇది యెట్లు ధర్మమగును ? పతివ్రతగా నుండ గోరుదానికి అయిదుగురు పతుల కాపుర మెట్లు సాధ్యము ? నాకు తెలియక అయిదుసార్లు పతి యని అనివేసినాను. కాని నా యుద్దేశము అయిదుగ రని కాదు. అనగా శివుడు 'నీకోరిక ధర్మబద్ధమైనదే, ఇది నీ సంకల్పము కాదు; దైవసంకల్పము. అయిదుగురు భర్తలుం డుట నీపాతివ్రత్యమునకు అడ్డుకాదు' అని సమాధాన పరచెను. సమాధాన పడిన ద్రౌపది అయిదుగురు పతులతోను ఒకేరీతిగ మెలగగలిగి, పూజింపగలుగ నట్లు, తన మనస్సున అయిదుగురిపై ఒకే విధమగు ప్రేమ నిండి యుండునట్లు వర మడిగినది. శివుడామె కోరికను మన్నించి నాడు. ఈజన్మ రహస్యములు తెలి కొన్న ద్రుపదుడు ఆమెను పాండవు కిచ్చి వివాహము చేసినాడు. ద్రౌప జీవితమంతయు శివు డిచ్చిన వరప్రభా మున అన్యోన్యమగు దాంపత్యముతో నడచినది.

అన్యోన్యత యనగా భర్త యేమనినను పడియుండు టనికాని, భర్తయేమై పోవు చున్నను చూచుచు ఉండిపోవు టనికా అర్థము చేసికోరాదు. భర్త మార్గము తప్పి నపుడు చూచుచు ఉండిపోయిన సతి తాను ఉపేక్షచేసిన దగుచున్నది. ఆ సమయమున సతి చేయవలసినది ఉపేక్ష

చూపుట కాదు. పతిని ఉద్ధరించుట. సతి పతి నుద్ధరించుటా ? యని ఆశ్చర్యపడ రాదు. అట్టి ఆశ్చర్యము అడ్డుపడినచో అది అన్యోన్యత యెట్లగును ? సామాన్యముగ మనము భార్యయెడల భర్తకు గల బాధ్యతలను చెప్పుచుందుము. భార్య భర్తకు ఒనర్చవలసిన విధు లని చెప్పుచుందుము. విధి నిర్వహణమే కాక బాధ్యత వహించి భర్తను అవసరమగు నపుడు సరిదారిని నడుపగలుగుట ఉత్తమ భార్య స్వభావము, ఇట్టిస్థితియే నిజమగు అన్యోన్యత అనబడును. ద్రౌపది పాండవులచే ఆరాధింపబడినదని చెప్పవచ్చును. ఆమెను వారు సేవించిన తావులుకూడ ఉన్నవి. విరాటుని కొలువున కేగునపుడు నడువలేని యామెను వారే మోసుకొని పోయిరి. అవసరమగు వేళల మొగమాట పడక ద్రౌపది పరుషముగ మాట్లాడి తన భర్తలను పురుషులనుగ నిలబెట్టినది. ఇట్లు నిలబెట్టగలిగినది కనుక కుంతి ద్రౌపదిని మెచ్చుకొని, అవసరమగు నెడల ద్రౌపది సలహా తీసికొను మని కబురు పెట్టినది. ద్రౌపది పరుషముగా మాట్లాడినను పాండవులు కోపగించుకొనలేదు. పైగా ఆమెను గురువుగా స్వీకరించిరాయనునట్లు కర్తవ్యము తెలిసి ప్రవర్తించిరి. ద్రౌపది యనిన పాండవులకు అభిమానము, అనురాగమే కాక ఆరాధనకూడ ఉన్నదని తెలియుచున్నది. ఈస్థితులను చూచి, విని, అబ్బురపడిపోయినది సత్యభామ. సత్యభామ అడిగిన ప్రశ్నకు సత్యభామాద్రౌపదుల ప్రవర్తనమే సమాధానము. సత్యభామ భర్తను తన కొంగున ముడి వేసుకొనవలె నని చూచినది. సవతులకు దక్కకుండ పతి తనకే దక్కవలె నని పెనగులాడినది. పతిని సొంతము చేసికొను యత్నములో పతిని దానమీయవలసి వచ్చినను వెనుకాడలేదు. అనగా సత్యభామకు ప్రేమలే దని యర్థముకాదు. కాని ఆమె కోరిన దొక్కటే. తాను పతి ననుసరించుటకాక, పతి తన్ననుసరించవలెను. ద్రౌపది అట్లుకాదు. పాండవుల కెందరో భార్యలు కలరు. కారణమేదైన కావచ్చును కాని సర్వకాల సర్వావస్థల యందును పాండవులను వెన్నంటి యున్నది ద్రౌపది యొక్కతెయే. పతులమార్గము ననుసరించుటయే ద్రౌపది లక్ష్యము. తన పతులు ధర్మమార్గమును తప్పక నడుతు రని వారి ధర్మపత్ని విశ్వాసము. అప్పుడప్పుడు అధర్మము పాండవులపై ఎత్తివచ్చినపుడు, లేక కూడని కరుణతో పాండవులు ధర్మమార్గమును తప్పజూచినపుడు ద్రౌపది మనకెందుకులేయని యూరకుండక నిలబడి నిష్ఠురములాడియైనను వారిని ధర్మమార్గమున కున్ముఖులనుగా జేసినది. పరుషముగ మాటలాడినది ద్రౌపది. ఈమె ఏమి 'పతివ్రత' అని లోక మను నని యామెకు తెలియును. లోకాభిప్రాయమునకు వెరచి తన కర్తవ్యమును విడిచిపెట్టు బేలకాదు ద్రౌపది. అభిప్రాయములు కావు ముఖ్యములు. అభిప్రాయములు ఎవరి బుర్రనుబట్టి వారికి పుట్టుచుండును. ఎంతమంది అభిప్రాయముల కని విలువ నియ్యగలము ? అట్లని తానాచరించినది ధర్మమగునో కాదో ఎట్లు తెలియును ? ద్రౌపది తన జీవితమున ఒక్కనినే ప్రమాణముగ తీసికొనినది.

ఆతని ప్రణాళికకు తన జీవితమును సమర్పణ చేసినది. తన హృదయము నాతనికి ఆలయముచేసి అనుక్షణము అతడిచ్చు సూచనల కనుగుణముగ తన కుటుంబజీవితమును నడుపుకొనుచు వచ్చినది. ఒక్కడే జగన్నాటక సూత్రధారి యగు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుని ధర్మసంస్థాపన ప్రణాళికకు ద్రౌపది చక్కని యుపకరణము. ధర్మార్థమై వెలుగుచున్న పాండవప్రజ్ఞయను దీపము అప్పుడప్పుడు కొడిగట్టుచున్నను, వెలుగు తగ్గుచున్నను, ఆ ప్రమిదలో నూనె అయిపోవుచున్నను చూచుకొనవలసిన బాధ్యతను ద్రౌపదికి అప్పగించినాడు శ్రీకృష్ణుడు. కావుననే సమయానుగుణముగ ఉత్సాహపరచుచుండును, మందలించుచుండును. పరుషముగా మాట్లాడి వారి పురుషార్థము చెడకుండ చూచుకొనుచుండును. ఏమిచేసినను పతుల హితము కోరి, కృష్ణుని ప్రణాళికకు అనుగుణముగ చేయును. కనుక ఆమె పలికినదెల్ల, చేసినదెల్ల ప్రమాణమే. ధర్మ మనుటకు ప్రమాణము శ్రీకృష్ణుడే. ద్రౌపదీ పాత్రస్వరూపము ఆరాధించి అనుసరింపదగినది కాని చర్చించి యాడిపోసుకొనదగినది కాదు. కుంతీదేవి యంతటిది ఆమె ప్రవర్తనమునకు సంతసించి అపారమగు ప్రేమను ఆమెపై క్రుమ్మరించినది. అరణ్యవాసమున కేగువేళ తన బిడ్డలను ఆమె చేతిలో పెట్టినది. సహదేవుడు చిన్నవాడు గనుక వానిసంగతి చెప్పినది, మిగిలినవారిసంగతి చెప్పలేదు. అంతే ! కోడలికి అత్త మెచ్చికోలుకన్న కావలసినది ఏ మున్నది ?

అవసరమగు సమయముల తగురీతిని ప్రవర్తించినను 'నేనింతదాన'నని ద్రౌపది యెప్పుడును భావించలేదు. నిజమునకు ద్రౌపదిదృష్టిలో తానులేదు. తనభర్తలైదుగురియందును తానంతర్యామియై వారితో నడచినది. కృష్ణుని యాజ్ఞననుసరించి వారిని నడపినది. అందువలననే ద్రౌపది లేనిచో పాండవులు లేరు. పాండవులు లేనిచో తాను పుట్టనవసరము లేదని ద్రౌపది హృదయము.

పాండవులైదుగురు అయిదురకముల స్వభావములు కలవారు. వారికైదుగురికి ఎవరికివారికి ద్రౌపది తన భార్యయే యనిపించును. ఎవరి స్వభావమున కనుగుణముగ వారితో వర్తించి వారి స్వభావమును ధర్మార్థముగ మలచుటకు యత్నించినది ద్రౌపది. పంచేంద్రియములద్వారా వ్యక్తమగు ఒకేమనస్సు ఆ అయిదింద్రియములకు తృప్తికలిగించునట్లు ద్రౌపది భర్తలయిదుగురకు అనుగుణముగ జీవించినది

మనస్సు బుద్ధితోను, బుద్ధితోకూడిప్రజ్ఞతోను ఏకత్వము ననుభవించుచు ఇంద్రియములను ధర్మార్థముగ జీవింపజేసినట్లు ద్రౌపది కృష్ణుని ప్రణాళికతోను, కృష్ణునితోను ఏకత్వ మనుభవించి పంచపాండవులను ధర్మార్థముగ జీవింపజేసినది.

అట్టి ద్రౌపది విరాటుని కొలువులో ధర్మజుని తూలనాడినట్లు మాట్లాడినది. ఇట్లు మాట్లాడుట ధర్మమా? అధర్మమా? ఈప్రశ్న కడుపులో నీళ్ళు కదలకుండ కూర్చున్న మన విమర్శకులకు వచ్చినది. ద్రౌపది ధర్మాధర్మములు ఆలోచించు స్థితిలోనున్నదా? అన్న ప్రశ్న వేసికొన్న సమాధానము లభించును. కీచకుడనిన ఆ ఘట్టము చదువుచున్న మనకే ఒళ్ళు గగుర్పాటు చెందుచున్నది. ఆతనిరూపము దర్పము, మదము, మితిమీరుచున్న ఆతని ప్రవర్తన మన కనులముందు మెదలి మనమే భరించలేకున్నాము. చదివిననే తట్టుకొనలేకున్నామే మరి యది జరిగినపుడెట్లుండును? ద్రౌపదిస్థితి వర్ణనాతీతము. ఏక్షణమునకు ఏమిజరుగునో ఆమెకు అంతుపట్టకున్నది. సుధేష్ణ యింట కీచకుడు ప్రవేశించుటతో పీడకలవంటి యీ స్థితి ప్రారంభమైనది. ఒకప్రక్క కీచకుడా అసాధ్యుడు. తా మున్నదా అజ్ఞాతవాసము. అక్కడికిని గంధర్వులున్నారని భయపెట్టినది. కాని వాడు భయపడలేదు. ఇప్పుడేమి చేయవలెను? ఈలోపల సుధేష్ణ కీచకుని యింటికి వెళ్ళి మదిర దెచ్చి పెట్టుమన్నది. సుధేష్ణ ఎందుకు పంపుచున్నదో ద్రౌపదికి తెలుసు. అనేకవిధముల బతిమాలి తప్పుకొనజూచినది. కాని సాధ్యపడలేదు.

చేయునది లేక గడపదాటి కృష్ణుని తలచుకొని, కనపడుచున్న సూర్యునికి నీవేరక్ష యని నమస్కరించినది. సూర్యుడు కనబడని ఒక రాక్షస స్వరూపమును సృష్టించి పరిస్థితి మితిమీరువేళ కలుగజేసికొనవలసినదిగా ద్రౌపది వెంట పంపినాడు. (సశేషం)

# "రసిక్" కూనలమ్మ పదాలు

(గతసంచిక తరువాయి) — రత్నశ్రీ (యస్. రాజశేఖర్, బి. ఏ.)

ఉన్నవాటితో సంతృప్తిపడాలి. లేని వాటికోసం ఆరాటం పనికిరాదు. ఉన్న వాటితో తృప్తిపడేవాళ్ళు ఉత్తములు. అసలు కోరికలకు అంతులేదు.

'లేవులే వని నగలు
లేమకుండిన దిగులు
రేయియంతయు వగలు'

తరచు బంధువులు రావడం వల్ల, త్వరలోనే అవుతుంది ఇల్లుగుల్ల.

'ఉవిద బంధుజనాలు
ఉన్న నాల్గుదినాలు
ఊరినిండబుణాలు'

భార్యామణితో, భర్తగారు షికారు కెళ్తే జేబు ఖాళీఅవుతుంది. కొత్తిమిర కోసం వెళ్ళి కొత్తచీర కొనుక్కొస్తాడు. అదీ భార్య మజాకా.

'భార్యవెంట బజారు
భర్తగారు [వెడితే] షికారు
జేబుఖాళీ ఖరారు

భార్యాభర్తల తగవు తీర్చడానికి సమర్థుడు మన్మథుడు.

'సతికి పతికి తగవు
చక్కజేసెడి తెరువు
మరుని కోకనికె సులువు'

ఈ రోజుల్లో అమ్మాయిలు ఎంత అందగా ఉన్నా, ఎంత విద్యావంతురాండ్రైనా, కట్నంలేకుండా పెళ్ళిచేసుకోడానికి ఎవరోకానీ ముందుకు రావటంలేదు.

'అమ్మాయి సుదక్షిణ
అగుగాక సలక్షణ
కావలెను సదక్షిణ.'

నేటి మన విద్యావిధానం, లోపభూయిష్ఠంగా ఉంది. చదువువల్లప్రయోజనం సన్నగిల్లుతోంది. వృత్తులతోనే హాయిగా బ్రతకవచ్చు. పెద్దచదువులు చదివి ఉద్యోగాలు లేక బాధపడేవారికంటే ఏమీతోచకుండా చాకలిపని చేసేవాడునయం.

'ఎమ్మేలు, బి య్యేలు
ఎందు కీడిగ్రీలు
మడివేలు, కడుమేలు.'

నేటివిద్యార్థుల్లో చాలామంది కట్నం కోసం చదువుతున్నారు. విజ్ఞాన సముపార్జన వారిధ్యేయంకాదు.

'కాదుగా విద్యార్థి
కాదుగా జ్ఞానార్థి
విద్యార్థి కట్నార్థి.'

చదువుల్లేనివారే (మంత్రి) పదవులకు సిద్ధమౌతున్న కాల మిది.

'వంటికంటదు చదువు
వదలుకొంటివి పరువు
మంత్రిపదవికి నిలువు.'

ప్రతీవాడికి కొంత సొంత డబ్బు అవసరం. లేకపోతే మగుగున పడిపోతాం.

'సొంతబాకాలేని
చవటయెవ్వడుకాని
విలువచెయ్యడుకాణి.'

లాటరీలను ప్రోత్సహించి ప్రభుత్వం ఆదాయం చూసుకుంటే, ప్రజలఆరోగ్యం (శ్రేయస్సు) పట్టించుకోకపోతే ఆప్రభుత్వంమీద జనతకు మమత ఉండదు.

'లాటరీలకు జనత
ప్రోత్సహించెడు ప్రభుత
నీతిమాలిన పతిత.'

కాలుజారితే, తీసుకోవచ్చును కానీ నోరుజారితే తీసుకోలేము. నోరు మంచిదైతే ఊరుమంచి దవుతుంది. అందుకే ఆలోచించి మాట్లాడు. మాట వదలి, బాధపడడంకంటే, ముందు జాగ్రత్త పడడం మంచిది.

"మాటకురుసుగ విడిచి
మాటిమాటికి తలచి
ఫలములే దిక వగచి".

అన్నిమతములసారం ఒకటే, ఒకే గమ్యం, మార్గాలు వేరు.

"మతము లన్నిటిలోను
పరమార్థ మొకటేను
అనుచునమ్మెద నేను"

అన్ని మతాలవారు తెల్సుకోవల్సిన విషయం ఇది. వాగ్దానాలు చేసి నిలబెట్టుకోలేకపోవడం కన్నా, వాగ్దానాలు చేయకుండా చేయగల్గినంత మేలుచేయడం మిన్న.

"భాస సలుపుట కలదు
ప్రతినపలుకుట కలదు
నిలుపుకొనుటయే యరుదు".

రంగులు వేరైనా, భాషలు, మతాలు, కులాలు వేరైనా మనుషులంతా ఒక్కటే అందరిలోను ఉన్నది రక్తమే. అందరూ చేరేగమ్యం ఒక్కటే.

"నల్లవాడయ్యేది
తెల్లవాడయ్యేది
కాలు నొకటే బూది".

ఇదీ వేదాంతసారం. ఎవరిధర్మంవాళ్ళు ఆచరించాలి. ఎవరిమతాన్ని వాళ్ళు గౌరవించాలి.

"ఎవనిధర్మమువాడు
అవని బ్రోచిననాడు
ధరణి స్వర్గము చూడు".

స్నేహంయొక్క ప్రాశస్త్యము చెప్పారు.

"స్నేహ మనియెడి పదము
శీతలానిల సమము
సేద దేరును మనము".

మానవుని నైజము ఏమిటంటే దూరపు కొండలునునుపు,పొరుగింటి పుల్లకూర రుచి అని భావిస్తాడు.

"తెలుగువారము మనము
తెలుగుతీపిని కనము
పొరుగు కూరను విడము.

ఇదే విషయాన్ని జె. బాపురెడ్డి తన కవితలో ఒకచోట ఇలా అంటాడు.

"ఎవడో బైటివాడు మెచ్చుకుంటేతప్ప
ఎందుకూ పనికిరానివాళ్ళం మనం
ఇటలీవారికి తెలుగంటే
ఏమిటో తెలియ దంటే వినం."

తెలుగును "Italian of the East" అన్నపుడు పైవాక్యం గుర్తొస్తుంది.

నేటి యువతరం వెర్రితలలువేస్తూపోయి, పాశ్చాత్య సంస్కృతి ప్రభావంలో కొట్టుకుపోతున్నారు. ఇక్కడ డా॥ సి. నా. రె. చెప్పినమాట గుర్తుకొస్తుంది. అచ్చమైన జీవితం అనుకరణలోలేదు, ప్రతిఘటనలోవుంది. స్త్రీల బొట్టునుంచి కట్టువరకు ప్రతీదీఅనుకరణ. అది చూడ్డానికి ఇంపుగా ఉండదు. తలవంపుగా ఉంటుంది.

"నాభిక్రిందికికోక
నభముబోలెడురైక
పరువు నిల్చునెట్లోక"

మన సినిమాలు ఈమధ్యవచ్చేవి మరీ అసభ్యంగాను, అశ్లీలంగాను, అవమానకరంగా ఉంటున్నాయి.

"నిర్లజ్జ చిహ్నాలు
నిర్గంధ కుసుమాలు
నేటి మనసినిమాలు"

పై పదాలు నిత్య సత్యాలు.

కవిత్వం వ్రాయడం ఈరోజుల్లో చాలా తేలికైపోయింది. ఇప్పుడు కవిత్వం వ్రాసేవారిని కొంతమందిని, మినహాయిస్తే మిగతావారిదంతా కవిత్వంగా చెలామణి అవుతున్న అయోమయత్వం.

"కప్పు కాఫీ త్రాగు
కవిత తానే సాగు
అమృతవాహినిలాగు"

రసిక్ తన రచనానైపుణ్యంతో చక్కగా 'కూనలమ్మపదాలు' వ్రాసి మంచిపేరు తెచ్చుకున్నాడు. రసజ్ఞులు కూనలమ్మపదాలు చదివి నేను చెప్పిన విషయాలు నిజమోకాదో నిర్ణయించండి.

"ఈకూనలమ్మ పదాలు
కోమలాంగి పెదాలు
కవ్వించు డెందాలు."

ఈ కూనలమ్మ గొప్పతనం చెప్పి ముగిస్తున్నాను. ఈ పదాలు మధురాతి మధురాలు. ఈపదాలు ఆనంద—పథాలు.

"చిన్ని పాదములందు
చివరిప్రాసల చిందు
చేయుపీనుల విందు"

"ఈపదమ్ములకబ్బి
ఇచ్చింది సంతృప్తి
చేయనిమ్ము సమాప్తి
ఓకూనలమ్మ."

— ఆరుద్ర.

## వైకుంఠపాళి

— శ్రీ కోదూరి శ్రీధర్

ఎగప్రాకులు
దిగప్రాకులు
విషవలయాలు
వింత నిచ్చెనలు
ఆశల పందాల
గవ్వల మోతలు
అందిన ఆనందాల
అందని ఆరాటాలు
పునరావృత్తి పులకింతల
వదలని మమతలు
అనుభూతుల పరవళ్లు
ఎరో వైకుంఠపాళికి గళ్ళు.

......

# చేమకూర వేంకటకవి సారంగధర చరిత్రము

- శ్రీ డా. ఎస్. గంగప్ప, ఎం.ఏ., పిహెచ్.డి.

ఆనంతరిక ప్రబంధకవుల్లో ప్రసిద్ధతర కవి చేమకూర వేంకటకవి; దక్షిణాంధ్ర యుగంలో వెలసిన అపర కృష్ణదేవ రాయలు, అభినవభోజుడు అయిన రఘునాథరాయల ఆస్థాని. తనకృతిని ప్రతి పద్య చమత్కృతిగా చేయాలన్నది చేమకూర వేంకటకవి ఆకాంక్ష; ప్రతిజ్ఞ. ఈవిషయంలో విజయవిలాసంలో కృతకృత్యుడైనట్లు స్పష్టం. కానీ సారంగధర చరిత్ర ప్రథమ కవితాప్రయత్నం కావడంవల్ల అదికొంత కొరవడిందనే చెప్పాలి. అయినా సారంగధరచరిత్రలోను పద్యరచనాపాటవం, వర్ణనావైదగ్ధ్యం, శ్లేషవైభవం, కమనీయ కవిత్వపుసొంపు, సామెతల ఆమెతలు–రసగ్రహణ పారీణులైన పాఠకుల్ని రంజింపజేసి, ఆనందపరవశుల్ని చేస్తాయి. 'కూరలో నస ఉన్నా, కవితలో పసఉన్న'దని అనాదిగా చేమకూర వేంకటకవి కవిత్వాన్ని కూర్చి వస్తున్నానుడి సర్వజనవిదితమే. చేమకూర వేంకటకవి సారంగధరచరిత్రలోని ఈకవితాగుణాల్ని స్థాలీపులాక న్యాయంగా తిలకిద్దాం.

సారంగధరచరిత్రకథ గౌరన నవనాథ చరిత్రలోఉంది. దీన్ని చేమకూర సర్వాంగ సుందరమైన కావ్యంగా రచించాడు. ఇది అందరికీ తెలిసిన కథే. రాజరాజనరేంద్రుడు మాళవపతి అంటూనే రాజమహేంద్రవిభు డని పేర్కొన్నాడు చేమకూర. అతనికి ఇద్దరు భార్యలు-

'కలరా యుల రాయనికిం
గులసతి రత్నాంగి భోగకుటిలశిరోజా
తిలకము చిత్రాంగియు నన
నెలజవ్వను లిరువు రంబుజేందునిభాస్యల్'
-(1-4)

రాజుకి రత్నాంగివల్ల నోములపంటగా జన్మించినవాడు సారంగధరుడు; శివుని వరంతో జన్మించడంవల్ల సారంగధరుడయ్యాడు. రాజు వేటకై వెళ్ళిన సందర్భంలో రాజకుమారుడు సారంగధరుడు మిత్రులతో పావురాల ఆట ఆడుతూండగా చిత్రాంగి మేడలో వాలుతుంది అతని పావురం. పావురం కోసం వెళ్ళిన సారంగధరుని ముగ్ధమోహనసౌందర్యానికి ఆకృష్ట అయి బలాత్కరిస్తుంది చిత్రాంగి. పినతల్లికి బుద్ధులుచెప్పి తిరస్కరించి వస్తాడు సారంగధరుడు. తిరస్కృత అయిన చిత్రాంగి కక్ష దీర్చుకోదలచింది. మాసినచీరగట్టి నేలపై పడుకొంది. రాజు వచ్చి అనునయించబోగా చిత్రాంగి నేరం సారంగధరునిపై మోపింది___

'...కామవికారము
ననుబలిమిం గౌఁగిలించి నఖములవ్రచ్చెన్
జనుగవ ముంజేతికంకణ
మున కద్దం బేల చూడుము మహీపాలా?'
(2-229) అని,

'స్తనకుంభతటమ్ము దిటమ్మునను జూపి డగ్గుత్తికతో' దుఃఖించింది. 'నీదుపట్టి నన్నెంతయుఁ బ్రేమఁ బట్టి రమియించిన యప్పుడె మామనైతి నీ కింతటినుండి కోడలఁ జుమీ ననుముట్టకు రాజశేఖరా!' (2-232)- అని రాజును రెచ్చగొట్టింది. విచారణ జరిపించి, కరచరణాలు ఖండించేట్లు శిక్షవిధించాడు రాజు. శిక్షానంతరం మత్స్యనాథుడనే సిద్ధుని ఔషధ మహిమచే కరచరణసహితుడవుతాడు సారంగధరుడు. ఇందలికథ ఇది. కానీ చారిత్రకం కాదు. ఈనాడూ సారంగధర మెట్ట అనీ, చిత్రాంగిమేడ అనీ రాజమండ్రిలో చూపెడతారు స్థానికులు. రాజరాజనరేంద్రునికి సారంగధరు డన్న పుత్రుడుగాని, చిత్రాంగి అనేభార్యగాని ఉన్నట్లు చారిత్రకాధారాలు లేవు. 'In this story (Sarangadhara Charitra) the animal passions of an old man were put before the audience, and the worst part is that a stepmother who is considered by the Hindus as a real mother, was brought into the play with all her animal instinct and made much of by actors to please the audience'—అని కోలాచలం శ్రీనివాసరావుగారు 1908లో ప్రకటించిన తమ ప్రపంచ నాటక చరిత్రలో దీన్ని నాటకీకరించడంవల్ల కలిగే అనర్థాల్ని గర్హించినా, పూర్వులేగాక ఆధునికయుగంలో ఎంతోమంది నాటకీకరించారు ఈకథని. ధర్మవరం రామకృష్ణమాచార్యుల 'విషాదసారంగధర'తో ప్రారంభమైంది ఈ నాటకపరంపర. చిత్రాంగి మోహం, రాజు వ్యామోహం, రత్నాంగి పుత్రవ్యామోహం, సారంగధరుని సచ్ఛీలం — మొదలైన భావాలుగల ఈకథను గ్రహించి, వేట, రాజువిరహం, చంద్రాద్యుపాలంభనం – మొదలైనవాటిని విరివిగా వర్ణించి సారంగధర చరిత్రని చక్కటికావ్యం చేయగలిగాడు చేమకూరకవి.

'ప్రతిపద్యమునందుఁ జమ
త్కృతి గలుగం జెప్పనేర్తు వెల్లడ బెళుకా
కృతివింటి మహారముగా
క్షితిలో నీమార్గ మెవరికిన్ రాదుసుమీ'
(పీఠిక-49)

-ఇది విజయవిలాసం పీఠికలోనిపద్యం. విజయవిలాససత్కృతిని అందుకొనే సమయానికి రఘునాథుడిలా మెచ్చుకు

న్నాడు చేమకూరని. 'ప్రతిపద్యమునందుఁ జమత్కృతి గలుగం జెప్పనేర్తు' నని చెప్పడం విజయవిలాసానికి సంబంధించిన మెచ్చు గుణం. విజయవిలాసకృతిలో ప్రతిపద్య చమత్కృతి సాధించాడు చేమకూర. శ్లేషవైభవంతో గాని, కాకు, వ్యంగ్యవైఖరులతో గాని, చక్కని పదప్రయోగంతో గాని, ఆలంకారిక శైలితో గాని ఈ చమత్కారాన్ని కవి సాధించినట్లు స్పష్టమవుతుంది. ఇది సారంగధర చరిత్రకు గూడా వర్తిస్తుంది.

చేమకూరకవి కవితలో కొట్టవచ్చినట్లు కనిపించేది శ్లేషవైభవం. ఆ యా పదాలకున్న అర్థద్వయంవల్లగానీ, పదాల విరుపు చేకలిగే అర్థద్వయంవల్ల గానీ చాలవరకు ఈ శ్లేషవైభవాన్ని సాధించి, చమత్కారాన్ని ప్రకటించాడు కవి. అర్థద్వయంవల్ల సాధించిన శ్లేషకీ దానివల్ల కలిగే చమత్కృతికీ ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి. మచ్చుకి ఒకటి—

'రమ్ముసారంగధర వేగిరమ్ముమాని
కలరవమ్ముల వణకించు గలరవమ్ము
నాదు మొలనూలి గంటల నాదువినక
చంటనీయురమానక చంటదగునె' (2-99

—ఇందు 'కలరవమ్ములు' అంటే పావురాలు, 'గలరవమ్ము' అంటే కంఠధ్వని. అలాగే 'నాదు'—నాయొక్క, 'నాదు'—శబ్దం' అనీ, 'చంటనీయురమానక చంటదగునె'— తన స్తనాలపై సారంగధరుని ఉరమానక చనుట అనీ అర్థం. ఇక్కడ 'నాదు', 'చంట' పదప్రయోగంతో అర్థద్వయంవల్ల శ్లేషని సాధించి చమత్కృతిని ప్రకటించాడు కవి. ఇలాగే పదాలవిరుపువల్ల కలిగే రెండర్థాల శ్లేషకు ఒక చక్కటి ఉదాహరణ—

'జనవరసూనుఁ డందులకుఁ
జాలఁ బ్రియంబు దొలంక నన్నెలం
తను గని నీకుమారుఁడఁగ
దా యిటుతక్కినవారికిన్బలెన్
జననిరో నాకు నింతయుప
చారము సేయఁగ నేటికమ్మ నే
డనవుడు, నాకు మారుఁడవె
యాటను జేయుదు నంచు నేర్పునన్'
(2-55)

—ఇందులో 'కుమారుడ' అన్న పదప్రయోగంతో చమత్కారాన్ని సాధించాడీ కవి. 'నీకుమారుడ'—నీపుత్రుడవని సారంగధరుడూ, 'నాకు మారుడు' అంటే నాకు + మారుడు = మన్మథుడని చిత్రాంగి చెప్పడంలో ఈ శ్లేష, తన్మూలంగా చమత్కారం స్ఫురిస్తాయి. మరో ఉదాహరణ—

'వాలిక మెఱుంగుఁజూపుని
వాలిగ నోసరించి యెపుడువడిఁ జేయును దా
నాలింగన మేమో యిపు
డాలింగనమనుచు నృపతివ్యాకులమతియై'
(2-197)

—ఇందులో 'ఆలింగన'మనీ, 'ఆలిన్ + కనము +' అనీ, పదచ్ఛేదంవల్ల శ్లేష; తన్మూలంగా చమత్కారం. పద్యాలకు పద్యాలే శ్లేషవైభవంతో రచించినవీ ఉన్నాయి. ఇలాంటివెన్నైనా ఉదాహరించవచ్చు.

పద్యరచనాపాటవం, కమ్మచ్చులోంచి తీగలాగినట్లు సాగే కవితాధార, తమకు తామై అలవోకగా వలదివచ్చి చోటుచేసుకొనే పదజాలం, చేమకూర కవితకు వన్నెబెట్టాయి ఇటు ఆంధ్రంలోను, అటు సంస్కృతంలోను చేమకూర సవ్యసాచి —

'సామీ! వింజపుఁగొండకాఁడవి ప
జ్జన్ గూడెముల్ గట్టి మా
సేమంబే సతమిచ్చఁ గోరి బలుబై
సిన్ బాగ్గెమున్ గల్గియా
బూమిన్ వేటలఁ గోటలందిరిగి మా
పున్నెన మాకచ్చికం
బేమిన్ లేక సుగానసుండుదుము నీ
వే దిక్కుగా నెమ్మగన్.' (1-64)

—ఇందు తెలుగు పలుకుల సొంపు పాత్రోచితభాష కానవస్తాయి. సంస్కృతభాషావైభవప్రకటనకు —

'చనియంతం గనియెన్ బ్రమోదమున నా
సర్వంకషోదారధీ
ఖనికూలంకషదానతోయఝరకృ
త్కాశల్యమేఘాయితా
త్యనఘాస్తోకయశోఘనుం దెదుట రుం
ద్రాభ్రంకషాశేషపు
ష్పనిధానావనిజాగ్రగణ్యము విరా
జద్దండకారణ్యమున్.'

(1-86)—ఇందు కవికిగల వర్ణనానైపుణ్యం స్పష్టం. వర్ణనావైదగ్ధ్యానికి, చమత్కారానికి, వేటవర్ణన, చంద్రాద్యుపాలంభనాదులు చక్కటి ఉదాహరణలు. ఇంకా తెలుగునుడికారపుసొంపు, పలుకుబళ్ళపసందు, సామెతల ఆమెతలు చేమకూర కావ్యమంతటా సహృదయ హృదయాల్ని రంజింపజేస్తాయి. అవగింజంతైనను, తామరపాకునీరు క్రియ, కంచుగీసిన గతి, ముత్తంగొంగుపసిడి, తలదడవి బాస చేసిన, అడ్డగాత్వేయు, కడిచికూర్చుండి, చేతులు పిసికికొనుచు, నిప్పులుద్రొక్కిన చందంబున మొదలైన పలుకుబళ్ళు 'కొండంతదేవరకు కొండంతపత్రిరి, తల ప్రాణము తోకకు వచ్చె, ముంజేతికంకణమున కద్దంబేల, మగవాడు బొంకినా యలవడికట్టినట్టులగు నాడది బొంకినగోడ వెట్టినట్టులగు, ఇంటగెలచి రచ్చగెలువు, ఎద్దినై సటన్నఁ గొట్టమున నేర్పడగట్టుమటన్న, కతకు కాళ్ళు ముంతకు చెవులీవడి గెదవు, నోరికోపలన్ ప్రేలిడినప్పుడుం గరవదు నీసుతుడు, తానొక్కటి తలచిన దైవమొక్కటి తలచు, ఓడలు బండ్లవచ్చు బండ్లోడలవచ్చు, నీటముంచినను పాలముంచిన నీవె దిక్కు, గ్రచ్చపోదగదల్చినకైవడి' మొదలైన తెలుగుసామెతలు, 'గ్రామో నాస్తి కుత స్సీమా, వినాశకాలే విపరీతబుద్ధిః, శరీరమాద్యంఖలు ధర్మసాధనం, రాజ్యాంతే నరకం ధ్రువమ్'

# ప్రకృతి లీల - "ఋతు హేల"

- శ్రీ డా. జి. బి. ఎన్. ఆచార్య, ఏం. ఏ., పిహెచ్. డి.

'ప్రాతసింగారముల్ పనికిరావనునట్లు
క్రొత్తచివుళ్ళతో కులికె తరులు
పండినచేలను బహుభూషలు ధరించి
భూలక్ష్మి మన్ననల్ పొందమిగుల
యామినీసతితుషారావగుంఠనముచే
సరిక్రొత్తచెలువమ్ము సవదరించె
పద్మినీకాంత శోభాహీనయగుచునా
థునిరాక యరమోడ్పుకనుల జూచె
తనమహోదార కరుణావిధానసరణి
ధరణి పంటలుపండించు వెరవుగల్గె
ననెడుగర్వమ్ము సంతసమును జెలంగ
తరలివచ్చెను హేమంతధరణిధవుడు !'

అని వినూత్నవిలసితమైన హేమంత శ్రీమత్త్వమును కొనియాడినారు. 'భూలక్ష్మి యామినీసతి, పద్మినీకాంత, హేమంత ధరణిధవుడు'అను రూపకములు 'ప్రకృతి మానవీకరణము' అను సుగుణమును సాధించినవి. వరిమళ్ళశోభను, మినుము, పెసలు జనుము మున్నగు పంటలను వర్ణించి కవి గారు వ్యవసాయముపై తమకుగల మక్కువను, వ్యవసాయములో తమకుగల అనుభవమును వెల్లడించుకొనినారు. స్త్రీలఒయ్యారములను సంతరించుకొన్న శాలిదండములు తుదికంకులు నిండవాల్చి విలుగబండినవనియు, కేదారవీథి కనుల పండువుగా నున్నదనియు వర్ణించుటయే కాక, రమ్యహేమంతమే ఋతురాజ మనునట్లుగా నున్న దని రమ్యముగా సంభావించినారు. 'ముద్దుగ దిద్దిన పెద్దముత్తైదువు, నుదుటికుంకుమబొట్టుకుదురనగ; నవయౌవనమ్ము సందడిసేయు యువతీల, లాగుమ్ముబింబాధరమ్మునంగ' ఇత్యాది వర్ణనలతో హేమంత మందలి కర్ణి కారఫలమును మనయెదుట ప్రత్యక్షమొనరించినారు. హేమంతమందలి చలి బాధకు తట్టుకొనలేక పేదవారుపడుఅవస్థలను ప్రస్తావించి, వారిపై తమ సానుభూతిని ప్రకటించినారు.

'భూవిష్ణువుల పెండ్లిముత్తైముల్ గా రహించెను ఘాసములతుది చేరి హిమము'

అని హిమబిందువుల విశిష్టముగా సంభావించినారు. హేమంత మాంత్రి కుడు పంట లిబ్బడిముబ్బడి పండజేయగా కర్షకులు తాము సంవత్సరమంతయు పడినకష్టములను మరచి మిక్కిలియానందించినారని సహజసుందరముగా సంభావించినారు. ఇంకను సంక్రాంతి పర్వదినపు వేడుకలను సంప్రదాయబద్ధముగా వర్ణించినారు. గొబ్బిదేవతలను, రంగవల్లులను, భోగిపళ్ళను ప్రస్తావించుచు-

'తెలుగు పడుచులు సంక్రాంతిదివ్యదీప్తు
లలర పుట్టింట్ల నధికన్యలవిధాన
ప్రతిపదోన్నతసంపత్ప్రభావమొలుక
లీల నడయాడి రానందహేల లొప్ప!'

అని తెలుగుదన ముట్టిపడునట్లు తియ్యగా వర్ణించినారు. సంతృప్తికరమైన విందుభోజనములను, కోడిపందెములను, హరిదాసుల భక్తిగీతములను, పితృదేవతలను గొల్చెడి కర్మిష్ఠులను, ప్రస్తావించి, పల్లెలు, పట్టణములు సంక్రాంతి సౌభాగ్యముతో స్వర్గఖండములై శుభప్రదీప్తిని పొందిన వని హర్షమును వెలిబుచ్చినారు.

'తమతమపాపపుంజములు దగ్ధము సేయ
పూన్చిరో నా రేగె భోగిమంట
వత్సరమ్మెల్ల సౌభాగ్యవర్ధనముగా
తోబుట్టువులవంట తోడరి తినిరి
శోకాపహమ్మని శాకదానమ్ములు
చేసిరి దంపతుల్ చిత్తమలర
లేదను మాటకు లేకుండగా తావు
బీదసాదల ప్రేమ బిలిచియిడిరి
ఎంత వైరాగ్యమును జను లంతరంగ
ముల వహించిరొ సంక్రాంతిపుణ్యదినము
లనుపమోన్నతు లందగా ననువుపఱచి
ఒకయపూర్వమహోత్సవ మ్మొనరఁ జేసె!'

అని హేమంతమునకు వీడ్కోలు పలికినారు. భోగిమంటలు పాపపుంజములను దగ్ధముచేయుచున్న వని సంభావించుట కవిగారి విశిష్టభావనాపటిమకు నిదర్శనము, 'శాకదానములు చేయుట శోకాపహమ్ము' అని సంభావించుటకూడ పైదానితో తుల్యమైన విశిష్టతను కలిగియున్నది. మొత్తముమీద పద్యమంతయు విశిష్టసంభావనలతో, విలక్షణ కవితాసౌభాగ్య సంవర్ధనముగా నున్నది.

ఋతువులలో కడపటిది శిశిరము. దీనికొక విశిష్టశక్తి గలదు. సకలజీవరాసులను తనకు గల 'సీతు' గుణముచే గడగడ

---

( 8 వ పేజీ తరువాయి )

మున్నగు సంస్కృత-సామెతలు కావ్యమంతటా కోకొల్లలు.

ఆనంతరిక ప్రబంధకవుల్లోకెల్ల శ్రేష్ఠుడు చేమకూర, కానీ సారంగధర చరిత్ర చాలావరకు పిల్లలమరి చరిత్రల కోవకు చెందిందనే చెప్పాలి. అయితే ఇందు చేమకూర విశిష్టత లేకపో లేదు. ఇందులో పూర్వకవులకు అనుకరణలు అనేకం ఉన్నాయి. వేటవర్ణనలో, చంద్రాద్యుపాలంభనంలో కొట్టవచ్చినట్లు ఈ అనుకరణలు కనిపిస్తాయి. ఇందులో కొన్ని అనౌచిత్యాలు, పునరుక్తులు ఉన్నాయి. రాజుతోపాటు వచ్చిన మంత్రులందరిఎదుట చిత్రాంగి' 'పయ్యెదగొబ్బునను బటానబయలుచేసి,' 'త్రివళీపరపీఠియై యొప్పచరేఖలు చూపడం, అనౌచిత్యం. ఇలాంటివి ఒకటి రెండువదలివేస్తే, చేమకూరకవితలో పస ఉన్నదన్న సంగతి స్పష్టం.ఇదీ ప్రతిపద్యచమత్కృతి సమన్వితమైన చేమకూరకవితావైభవం !

(ఆకాశవాణి సౌజన్యంతో.)

వణకించును. కవిగారు శిశిరఋతుధర్మముల కనుగుణముగా మానవచేష్టలెట్లుండునో చమత్కారముగా, బహువిస్తారముగా వర్ణించినారు. మచ్చునకీ క్రింది పద్యము నొక్కదానిని పరిశీలింతము.

'అగ్నిహోత్రభయమ్ము నందక వృద్ధులు
కంపటి మెడగట్టుకొని తిరిగిరి
ప్రాయమ్ము గడచినవారైన శయనమం
దిరము చేరిరి కాంతి తరల వెనుక
తరుణులుపడకటిల్ తప్ప నన్య మెఱుంగ
రింట నుండెడివారి నెఱిగికూడ
ఆకలిదప్పుల నరయ నేరక పిల్ల
లొకమూల ముసుగులో నొదిగియుండి
రంతకంతకు శిశిర మత్యధిక ధాటి
సీతువును బల్లెపట్టనసీమలందు
రేయిపవ లనుభేదమ్ము లేక వ్యాప్తి
జెందగాఁ జేసి క్రౌర్యనిష్యంది యయ్యె!'

వృద్ధులును, యువకులును, పిల్లలును – వయసుతో నిమిత్తములేక ప్రతియొక్కరును శిశిరఋతువుయొక్క క్రౌర్యమునకు లొంగిపోయినారు. యౌవనములో నున్న దంపతుల దేహములను, చిత్తములను గూడ మన్మథోద్దీపన విధా సమర్థనీయ బహుళ కార్య ప్రభావ విభాసితములను జేసి శిశిరము తన చేవను చూపించిన దని కవిగారు సహజవిషయమును బహుసమర్థతతో వర్ణించినారు. తమ కవిత్వపు 'చేవ'ను చూపించినారు. తెల్గువిస్తారభూమిలో శిశిరముస్వారిచేసిన దని ఒక్కమాటలో దాని యాధిక్యమును ధ్వనింపజేసినారు. శిశిరఋతుధర్మముల కనుకూలముగా మానవులేగాక పశువు లెట్లు వర్తించినవో కూడ వాస్తవికతతో వర్ణించినారు.

'క్షీరమ్ము కరియగా పేరుగాంచిన బఱ్ఱె
పగుల చన్నులు దూడ నెగిరితన్నె
పశువులశాలలోపల నున్న యాదూడ
వడి లేచి తల్లిపా లుక్కుడువబోదు
ముకుత్రాడునకు లొంగబోవనికోడెయు
పచ్చికమేతకై పరుగులిడదు
కుడితిత్రావగతొట్టె నిడబోకు ముట్టియు
త్రావ నెంచియుఁ జూచి కూవులింత
ఎరుకలేనట్టి తనసౌష్ట్య మెల్లయెడల
విస్తరింపంగ శిశిరమ్ము వేడ్క మీఱ
నడ్డులేక యథేచ్ఛగా నవని సంచ
రించు మదగజమట్లు గాండ్రించి మించె!'

పైపద్యము కవిగారి నిశితపరిశీలనా దృక్పథమునకు గీటురాయి. విశ్వనాథ సత్యనారాయణగారు తమ 'తెలుగుఋతువులు' కావ్యములో ఋతుధర్మముల కనుగుణముగా మానవులు, పశుపక్ష్యాదులు, ఎట్లను వర్తింతురో బహువిస్తారముగా, నిశితముగా పరిశీలించి వర్ణించినారు ఈ కావ్యములోగూడ ఆపోకడలే చాలవరకు అనుసరింపబడుట గమనింపదగియున్నది.* విశ్వనాథవారి కావ్యములోవలెనే ఈ కావ్యములోగూడ అన్నియు సీసపద్యములే యగుట పెద్దవిశేషము.

ఋతువులో వచ్చు 'రథసప్తమి, భీష్మైకాదశి, శివరాత్రి' మున్నగు పర్వదినములు ప్రస్తావింపబడి సంప్రదాయ సౌభాగ్యము ద్విగుణీకృతము చేయబడినది. ఈఋతువులో విస్తారముగా పండు చెఱకుపంటను, క్రొత్తబెల్లమును, ఆబెల్లముతో వండిన రుచ్యములైన భక్ష్యములను ప్రస్తావించి, శిశిరమును హాలికునిగా సంభావించినారు. ఒకఋతువును హాలికునిగా సంభావించుట కవిగారి ప్రత్యేకతను చాటుచున్నది.

'చీకటితప్పును చేసె మగం డని
కోపించు కామిని కదుటబడియె
అడిగినభూషణా లంద జేయని కాంతు
కొనియాడి దరిజేరె కోరి కాంత
అలిగి పుట్టింటికి నరిగిన కోపన
తనయంత పెనిమిటి దరియవచ్చె
అపరాధములు దండనార్హముల్ సైరించి
మదవతి ప్రియుని సమ్మాన మందె
తాను మన్మథునకూర్చు మిత్రము వసంతు
బోలి తరుణుల మన్ననల్ చాలబడయ
శిశిరుడు ప్రయత్నశతములు చేయనెంచె
ననగ చరియించె సకలాంధ్రమునరహించి!'

అని చమత్కారముతో శిశిరఋతువర్ణనమును ముగించినారు.

కాలప్రకృతి ఋతుచక్రభ్రమణము మీద ఆధారపడి యున్నది. నిత్యచైతన్యవంతమైన కాలపురుషుని హేలకు షడ్రుతువులు ప్రత్యక్షసాక్ష్యములు. అందువలననే ప్రాచీనకవులు ఋతువర్ణన నెపముతో కాలపురుషుని స్తోత్రముచే ధన్యులయినారు. అర్వాచీనకవులుకూడ వారినే అనుసరించుచున్నారు. 'తెలుగు సారస్వతమునందలి ఋతువర్ణన మహనీయులైన కవుల యాంతరహృదయభావమును తెలుపును. ఈవర్ణనలపట్లనే కవుల భాషానుభవ లోకజ్ఞానపాండితీప్రకర్షలు ప్రత్యేక మగును.'♦ అని శ్రీ రేవూరి అనంతపద్మనాభరావుగారి తీర్పు. ఈ తీర్పును 'ఋతుహేల' కావ్యకర్తలైన శ్రీ సామవేదం జానకిరామశర్మగారి పట్లకూడ అన్వయ మొనరింపవచ్చును. సంప్రదాయసిద్ధమైన వస్తువును స్వీకరించి, వర్ణనాత్మక శైలిలో నవ్యకావ్యమును సృజించి, శ్రీ శర్మగారు బహుధా ప్రశంసనీయులు

ఋతువర్ణనలను గూర్చిన స్వతంత్ర ఖండకావ్యములు నేడు అవిరళముగ వెలువడుచున్నవి. అయినను ఒక్కొక్క కావ్యము ఒక్కొక్క విశిష్టగుణమునకు కాణాచియై కవితాప్రియుల మన్ననక

పాత్రమగుచున్నది. మొత్తము మీద కావ్యములన్నియు మానవ ప్రకృతితో సంబద్ధములై, సందేశాత్మకములై సాహితీ సహృదయులచే సమారాధన మొనరింపబడుచున్నవి.

భావకవిత్వములో ప్రకృతికవిత్వమునకొక ప్రత్యేకతగలదు. అందునను ఋతువర్ణనలకొక విలక్షణస్థానము ప్రదానము చేయబడినది. ప్రతిసంవత్సరమునందును అవే ఋతువులు ఆవృత్తము లగుచుండును. అయినను మానవమనఃప్రవృత్తు లెప్పటికప్పుడు మారుచుండును. అభిరుచులు వేరగుచుండును. మారుచున్న కాలమును, సంఘమును, అనుసరించుట కవి పరమావధి. అందుచేత ఋతువులను గూర్చి ఎంతమంది కవులు, ఎన్నికాలములలో రచించినను విసుగు జనించదు సరికదా ఏదోఒకవిధ మగు నూత్నచైతన్యము చదువరులను ప్రభావితులను చేయుచుండును. కనుక నవీనముగ వెలువడు ఋతుసంబంధము లగు కావ్యములను కవితాప్రియు లెల్లరు సహృదయతతో స్వాగతము పలుకుట శ్రేయస్కరము.

---

* విశ్వనాథవారి 'తెలుగుఋతువులు' నుండి యిచ్చినవి రెండు ఉదాహరణములు :

'పడితితో ట్టియపైని దవుడు నాలుకలాగి
ముట్టెముంచదు మూలు మొదటి మొదవు'

'పాడిబఱ్ఱియు చనుల్ పగిలి తాఁకఁగ బాలు
తీయుచో నడ్డమ్ము తిరిగి తన్నె.'

♦ ప్రకృతికాంత : శ్రీ రేవూరి అనంత పద్మనాభరావు. పుట : 186.

---

# మాఘుని కావ్యనిర్మాణ దక్షత

– డా. నేతి అనంతరామశాస్త్రి, ఎం. ఏ., పిహెచ్. డి.

( గతసంచిక తరువాయి )

అలంకారశాస్త్రముపై కవికి సంపూర్ణాధికారము కలదు. అయిన దానిపై తన సమస్త ప్రతిభతో శాసనము చేయును. శ్లోకమునందలంకార మప్రయత్నసిద్ధముగనే యుండును. కాని యది బలవంతముగా నతికించిన ట్లగపడదు. వక్రోక్తిచే నలంకృతమై శబ్దార్థముల చమత్కారముతో నుత్పాదితములైన అలంకారముల చేత సుసజ్జిత పదవిన్యాసమే మాఘుని దృష్టిలో నిజమైన కావ్యమునకు నిదర్శనము.

"ఉదయశిఖరి శృంగ ప్రాంగణే ష్వేష రింగన్
సకమల ముఖహాసం వీక్షితః పద్మినీభిః ।
వితతమృదుకరాగ్రః శబ్దయంత్యా వయోభిః
పరిపతతిదివో ఽంకే హేలయా బాల సూర్యః॥ (11.47)

ఉదయశిఖర ప్రాంగణమందు సంచరించు బాలసూర్యుడు పద్మినీజాతి స్త్రీలచే ముఖకమలహాసముతో చూడబడి పక్షుల చేత శబ్దము చేయుచు అంతరిక్షమనెడి తల్లి యొక్క ఉత్సంగమునందు మృదుకరాగ్రములతో పడుచుండెనట. ఇట శ్లేషమూలకమైన అతిశయోక్తి రూపకముచే సర్గగాంభీర్యము సాధింపబడెను.

"య త్రోజ్ఝితాభి ర్ముహు రంబువాహైః
సమున్నమద్భి ర్న సమున్నమద్భిః
వనం బబాధే విష పావకోత్థా
విప న్నగానాం నవిప న్నగానామ్"–
(4.15)

రైవతకపర్వతము యొక్క వనములకు అనవరత వర్షపాతకారణముగా అగ్నిబాధలేదని తాత్పర్యము. పదలాలిత్యము సుకుమారాక్షరముల నేరికోరి కూర్చుట వలనను ఛేకానుప్రాసాది శబ్దాలంకారము లప్రయత్నసిద్ధముగా వచ్చిపడుటచేతను సాధింపవచ్చును. యమకరచనము విశేష సాహాయ్యకముగ నుండును.

ఇంకను ఇట్టి ఉదాహరణములు కావ్యమందతటను తామరతంపరవలె పూలజొంపములై గుబాళించుచున్నవి.

19వ సర్గ సంపూర్ణమైన 41 ఛందోరీతులతో ఒప్పియున్నది. మాఘుఁడు 'మాలినీ'చ్ఛందస్సునకు రససిద్ధుడైన ఆచార్యుడు. ఈ మహాకావ్యమందు యమక (6-67, 78), శ్లేషధ్వని (3-53), అనులోమవిలోమ ఏకాక్షర |(19-114) ద్వ్యక్షర (19-66-84, 86) మురజబంధ (19-29), చక్రబంధ (19-120), శ్లోకపాదము రెండువైపులనుండి చదివినను సమానముగానుండుట (19-40, 88) ప్రతిలోమము (19-34) మొదలగు సర్వకావ్య ధర్మములతో నీకావ్యము మూర్తీభవించినది.

ఈకావ్యము యొక్క ప్రాశస్త్యమును గూర్చి కొన్నిసూక్తులు వ్యవహారమున గలవు. అవి యీ కావ్యము యొక్క, కవియొక్క ఆధిక్యమును తెలుపుచున్నవి

"మురారిపదచింతా చే త్తదా మాఘే
రతిం కురు
మురారిపదచింతాచే త్తదా మా ఽఘే
రతిం కురు"—

మురారి అను కవి పదబంధమును చింత చేయు తలపున్నచో మాఘకవికృత శిశుపాలవధ కావ్యమునందు రతిని (ఇష్టమును) చేయుము. శ్రీకృష్ణపదచింతన నీకున్నచో పాపకార్యమునందు రతిని (ఇష్టమును) చేయకుము. ఈ కావ్యపఠనము వలన మురారి శ్రీకృష్ణుని పాదపద్మచింతన సమకూరుచున్నది.

రసికజనులు చెప్పునదేమన—

"ఉపమా కాళిదాసస్య
భారవే రర్థగౌరవమ్ ।
దండినః పదలాలిత్యం
మాఘే సంతి త్రయోగుణాః ॥"

భారవి అర్థగౌరవము శిఖరాయమాణముగా చేసెను. దండిని పదలాలిత్యమునకు చెప్పి యితరుని చెప్పవలెను. పై ముప్వురు మూడు గుణములకు ప్రసిద్ధి చెందియుండగా నామూడు గుణములు శిశుపాలవధకావ్యము నందు సమృద్ధిగానున్నవని తాత్పర్యము. దీనినిబట్టి యీ కావ్యముయొక్క యాధిక్యము స్పష్టమగుచున్నది. మహాకవి పదముల రచన అత్యంత సుందరమైనది. ఏపదమునుకూడ దానిస్థానమునుండి తొలగించుటకు వీలులేదు. పదముల లలితవిన్యాసము నిజముగా పరమ ప్రశంసనీయమైనది.

ఉపమాలంకారవైచిత్రి :-

"దధాన మంభోరుహకేసరద్యుతీ
జటాశ్శరచ్చంద్ర మరీచిరోచిషత్
విపాకపింగా స్తుహినస్థలీరుహో
ధరాధరేంద్రం వ్రతతీతతీ రివ" (1-5)

నారదుడు రాగివన్నె జడలు కలిగి తెల్లనిమేని రంగుగలవాడు. కావున పండబారి పింగళకవర్ణములైన, మంచునేలలో బుట్టిన తీగె తుట్టలను దాల్చు మంచుకొండవలె నుండును. దీనినిబట్టి జటాధారి శరచ్చంద్ర మరీచివంటి కాంతి కలవాడనియు, తుహినస్థలియందు పుట్టుటచే విపాకపింగములైన వ్రతతీతతులు కలిగిన హిమవంతుని వంటివాడనియు పోల్చబడుట కడుంగడు రమణీయముగానున్నది. ఇట్టి ఉపమానములు కాళిదాసుని ఉపమానములతో దీటయినవి గ్రంథమంతట విస్తరించియున్నవి.

అర్థగౌరవమునకు :-

"అపశంక మంకపరివర్తనోచితా
శ్చలితాపురఃపతి ముపైతు మాత్మజాః
అనురోదితీవ కరుణేన పత్రిణాం
విరుతేనవత్సలతమైష నిమ్నగాః"
(4-47)

ఇక్కడ తమ పుత్రికలు అత్తవారింటికి పోవు సందర్భమున తండ్రులు దుఃఖించుట లోకస్వభావము. ఈ యర్థమును పైశ్లోకమున రైవతకపర్వతుడు తన పుత్రికా సమానులగు నిమ్నగలు భర్తయగు సముద్రుని చేరు సమయమున పక్షుల కూజితములద్వారా తన దుఃఖమును వ్యక్తముచేసెను. ఇట 'నదీనాం సాగరో గతిః' అనుసూక్తి ననుసంధింపవలయును ఈవిధముగ మాఘుడు ఈశ్లోకమున అర్థగాంభీర్యమును సాధించినాడు.

పదలాలిత్యమునకు :-

కుముదవన మపశ్రీ శ్రీమ దంభోజఖండం।
త్యజతిముదము లూకః ప్రీతిమాంశ్చక్రవాకః
ఉదయమహిమరశ్మి ర్యాతిశీతాంశు రస్తం
హతవిధిలసితానాంహి చిత్రోవిపాకః॥
(11 64)

ఇందు సూర్యోదయము చంద్రాస్తమయము వర్ణితములు. అసకృదక్షరావృత్తిచే పదలాలిత్యమును సాధించి యర్థాంతరన్యాసాలంకారముతో సౌందర్యమును సాధించెను. ఈవిధముగా పైమూడు గుణములు కావ్యమంతట విస్తరించియున్నవి. వానిని వెలికిదీయుట కష్టము. వ్యాఖ్యానసహాయముతో నర్థము చేసికొని దానిని జీర్ణము చేసికొనుట కష్టము. అందువలననే

"మాఘేనవిఘ్నితోత్సాహా
నోత్సహంతే పదక్రమేమ్
స్మరంతోభారవేరేవ
కవయః కపయోయథా"

మాఘమాసమందలి సూర్యుని యొక్క కిరణములను తాకి పదముల నడచుటకు కపులు కపులవలె నుత్సాహము చూపుట అనగా మాఘ భారవి కవులను తలచికొని యితరకవులు (కపిసమానులు) పదక్రమమున, అనగా వారి గ్రంథముల నర్థము చేసికొనుట కుత్సాహము చూపుటలేదు. అనగా మాఘుని శిశుపాలవధ పండితుల మేధాశక్తిని కంపింపచేయుచున్నదని భావము.

"స్పర్ధయావర్ధతేవిద్యా" అను న్యాయమును పురస్కరించుకొని మాఘుడు భారవియందలి స్పర్ధతోనే శిశుపాలవధ కావ్యమును రచించెను. భారవిని మించవలయు నని ప్రయత్నించి సఫలీకృతుడయ్యెను. వారిరువురి కవిత్వమునందును ననేకసామ్యములు కలవు. కొన్నింటి నిక్కడ వివరింతును.

ఈ రెండు కావ్యములందును ఆశీర్నమస్క్రియా పూర్వకముగ కాక వస్తునిర్దేశముతోనే కావ్యములు ప్రారంభింపబడినవి కిరాతార్జునీయమందలి మొదటి శ్లోకము 'శ్రియఃకురూణా మధిపస్య పాలనీం'అని భారవి ప్రారంభింపగా శిశుపాలవధయందు 'శ్రియః పతిః శ్రీమతిశాసితుం జగత్' అని మాఘుకుకూడ 'శ్రియః' శబ్దముతోనే ప్రారంభించుట కలదు. అంతేకాక భారవి ప్రతి సర్గాంతమందును 'లక్ష్మీ' శబ్దమును ప్రయోగింపగా మాఘుడు సర్గాంత శ్లోకములందు 'శ్రీ' శబ్దమును ప్రయోగించెను.

కథాసందర్భమును పురస్కరించుకొని చూచినయెడల రెండు కావ్యములందును గుప్తశత్రుసంహారముతోనే అంతమగుట జరగినది. శబ్దాలంకారములను ప్రయోగించుటలోను, నూతన ఛ్ఛందః ప్రక్రియలను వాడుటలోను కిరాతార్జునీయమందలి 15వ సర్గకు, శిశుపాలవధయందలి 19వ సర్గకు సామ్యముకలదు. రాజనీతి, అప్సర స్త్రీల జలక్రీడలు, పర్వత, యుద్ధాదివర్ణనలు రెంటియందును ఒకే క్రమములో సాగి సమానముగానున్నవి. భారవి శైవుడై తనకావ్యమందు శివభక్తిని ప్రకటింప మాఘుడు వైష్ణవుడై విష్ణుభక్తిని ప్రదర్శించెను. ఈవిధముగా మాఘుడు భారవి ననుకరించుటకు ప్రయత్నించి కృతకృత్యుడైనాడు. అందువలననే.

"తావద్భా భారవే ర్భాతి
యావ న్మాఘస్య నోదయం ॥
ఉదితే తు పున ర్మాఘే
భారవే ర్భారవేరివ"—అని కీర్తింపబడిరి.

ఈవిధముగా మాఘుని కావ్య నిర్మాణదక్షత ప్రస్ఫుటమగుచున్నది. ఇట్టి సమస్త గుణములతో కూడిన మాఘుడు సాహిత్యాకాశమందు శుక్రతారవలె ఎల్లప్పుడు తన ప్రతిభతోను, పాండిత్యముతోను ప్రకాశించును.

—0—

# విశ్వనాథవారి సాహిత్య విమర్శ

— శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం. ఏ.

(గతసంచిక తరువాయి)

సమీక్షలు :-

'నిర్మాణాత్మకముగ సౌందర్య సంపాదకము లగు నేయే గుణములు, ఏయే సంబంధములు కావ్యమున సముపస్థితములై యుండునో, ఆయా గుణములయు, సంబంధములయు, అనుభవము, సంపూర్ణావగాహనము, కావ్యసమీక్ష యనబడును'

(సా. ద. పే. 19

'గ్రంథ సమీక్ష. సాహిత్య విమర్శ రెండూ సన్నిహిత సంబంధం గల అంశాలు. మొదటిదాని బృహద్రూపమే రెండవది. కొండవంటి సాహిత్య విమర్శనా వ్యాసంగాన్ని గ్రంథసమీక్షకుడు తన పరిమితమైన అద్దంలో చూడడానికి ప్రయత్నిస్తాడు. ఏకదేశమైన గ్రంథ సమీక్ష యొక్క బహుముఖీనమైన వ్యాపక దశలో వెలువడే సిద్ధాంత గ్రంథమే సాహిత్యవిమర్శ (మహతి. 289)

విశ్వనాథవారు పెక్కు గ్రంథాలకు సమీక్షకులు. వారి విమర్శనాపద్ధతిలో శాస్త్రాని కెంతస్థానం ఉంటుందో అనుభూతికీ అంతేస్థానంఉంటుంది. సమీక్షలలోకూడ కవిత్వాన్నిగూర్చి, కావ్యవిశేషాలనుగూర్చి సూక్ష్మదృష్టితో పరిశీలించి కవితాసౌందర్యం మన కందిస్తారు విశ్వనాథ.

వీరభారతము :-

ఈ కావ్యం శ్రీ వక్కలంక లక్ష్మీపతి రావు గారిచే విరచితం. దీనిని సమీక్షిస్తూ విశ్వనాథ (24-11-60) 'ఈకథ రాణీసంయుక్తకథ. ఈకథ పలుమంది యిది వఱకే వ్రాసిరి. ఒకే కథ నెంతమంది వ్రాసినను వ్రాయవచ్చును. 'ముఖేముఖే సరస్వతీ'-ఎవరిరచన వారిది.ఒక కవి చేయగల సొగసులు మఱియొక కవి చేయలేడు. ఈయనగారి యీ కావ్యమునందు చాల సొగసులు కలవు.' అని కొన్ని ఉదాహరించారు.

చివరలో 'ఈకావ్యము విషాదాంతమా' అన్నదిప్రశ్న కాకుండగా కవి యొక చమత్కారము చేసెను. పృథ్వీరాజు నిద్రపోవుచుండగా ఘోరీకథ యంతయు నతనికి స్వప్నము వచ్చెను. అతడు మేల్కొనెను. అందుచేత విషాదాంతకథ కాదు. అందుచేత గాకపోవునా ? యన్నచో గావ్యమునకు సంబంధించి నంతవఱకు గాదు. మఱియు అన్ని సాగ్లోడిపోయి మానవసహజ లక్షణము మాలిన ఘోరీ యొక్క ప్రవర్తన భారతదేశ చరిత్రలో నొకదుష్టస్వప్నముకదా !' అని పాండవులచే రక్షించ బడిన దుర్యోధనుడు వారితో స్నేహం చేయవలసింది పోయి ప్రాయోపవేశం చేశాడనీ దానికి రాక్షసాంశవల్ల అతను పుట్టడమే కారణమని వ్యాసుడు చెప్పాడనీ, అట్లే ఘోరీలో రాక్షసాంశఉంది కాబట్టి భారత జాతికి ప్రతినిధి అయిన పృథ్వీరాజుకు దుష్టస్వప్నం వచ్చినట్లు కవి వర్ణించాడనీ, ఒక రహస్యాన్ని చెప్పడంబట్టి విశ్వనాథవారి సమీక్షాదృష్టి స్పష్టమవుతుంది.

ఆంధ్రవాఙ్మయసమీక్ష - రేడియో నాటికలు :-

వివిధయుగాలలో వెలువడిన ఆంధ్ర వాఙ్మయ లక్షణాలను సమీక్షిస్తూ విశ్వనాథవారు పెక్కు రేడియో నాటికలు వ్రాశారు. (భారతి - 1962) అవన్నీ వారి విమర్శనా ప్రతిష్ఠకు గీటురాళ్ళుగా ఉన్నాయి. భారతావతరణము ఫిబ్ర), ఉభయకవి మిత్రము (మార్చి) పాల్కురికి శివభక్తి (నవం), నందికంతపోతరాజు (అక్టో) వసంతోత్సవము (సెప్టెం), కనకాభిషేకము (ఆగ) నాటకోత్సవము (జూలై), అతిథ్యము (మే) హేతువాద యుగము (జూన్)

—(తెలుగులో సాహిత్యవిమర్శ.పు. 163

వ్యాసాలు :-

'ఆహ్లాదజనకత్వము లేక, విషయప్రధానములయ్యు, మనోహరమైన శైలిలో వ్రాయబడిన కొన్ని రచనలు సాహిత్యకక్ష్యకు చేరును. అంత మాత్రమున అవి కావ్యములు కాజాలవు. అవియే వ్యాసములు, (సా. శి. స 381).

శబ్దవ్యుత్పత్తినిబట్టి వ్యాసం, ఉపన్యాసం ఒక్కటే. వినదగిన ఉపన్యాసం చదువుకోడానికి పనికివచ్చేటట్లు వ్రాస్తే అదేవ్యాసం. అయితే వ్యాసాలన్నీ ఉపన్యాససారాంశాలు కావు. విమర్శవ్యాసాలు ముఖ్యంగా సారస్వత వ్యాసాలని పిలవబడతాయి. గ్రంథకర్త ప్రతిభావిశేషాలు సోదాహరణంగా వివరించే వ్యాసాలిటువంటివి. వ్యాసానికున్న శైలినిబట్టి, విషయవివరణ చేసేపద్ధతిని బట్టి, సోపపత్తికమైన సిద్ధాంతం ప్రతిపాదించే విధానమునుబట్టి, దానికి ప్రాముఖ్యమేర్పడి, సాహిత్య పరిధిలోకి వస్తుంది. చెప్పడంవేరు, వ్రాయడంవేరు. కొందరు చెప్పినట్లు వ్రాయలేకపోవచ్చు. అట్లే మరికొందరు వ్రాయగలిగినట్లు చెప్పలేకపోవచ్చు. అనుకున్న ప్రతిభావం అక్షరాకృతిలో పోతపోయడానికి, ఎంతోవ్యుత్పత్తిఉండాలి. అందుకే 'వ్యాసశైలికి ఆత్మీయాంశము,బుద్ధిగమ్యత,విజ్ఞానసాంద్రమైన వ్యుత్పత్తి,గల మేధావియే వ్యాసరచన కుపూనుకొంటాడు. అటువంటి ప్రతిభ, వ్యుత్పత్తి, గల కొద్దిమందిలో విశ్వనాథ వారొకరు. వివిధ విషయాలపై వెలువరించిన వ్యాసాలు వారి బహుముఖ ప్రజ్ఞావైలక్షణ్యానికి ప్రబల నిదర్శనాలు.

గ్రామ్యమా - వాడుకభాషా ? :-

ఈ వ్యాసంలో భాషనుగూర్చి చాలా వివరంగా చర్చించారు విశ్వనాథ. గ్రామీణులైన జనులు వాడుకొనేది గ్రామ్యమనీ, 'యస్త్వపభ్రంశో గ్రామ్యః'

అన్న నన్నయ గారి సూత్రంవల్ల ఈ గ్రామ్య శబ్దం వాడుక భాషలో ప్రయోగింప బడుతున్నదనీ తెలియజేశారు.

'పద్యం గ్రాంథిక భాషలో ఉండాలి. గద్యం వాడుక భాషలో ఉండాలి' - ఇది సత్యనారాయణ గారి భాషావాదం. తనకు రెండూ ఇష్టమేననీ అందుకే వాడుక భాష వల్ల భారత భాగవతాలు మూలపడతాయనే అభిప్రాయంతప్పనీ ఖండించారు. అయితే భారత భాగవతాలు వాడుక భాషలోనే వ్రాయడానికి దానికంత సామర్థ్యంలేదు. ఆ భేదం తెలియడానికి బొబ్బిలికథనీ, రంగరాయ విజయాన్నీ పోల్చి చూడమంటారు విశ్వనాథ.

వాడుక భాష చదివితే పిల్లలు పాడైపోతారనే వారికి ఈ యూనివర్శిటీ వారూ, ప్రభుత్వంవారూ పెట్టే గ్రాంథిక నామ గ్రంథాలవల్లనేపాడవుతారు కాని, శక్తిగల జీవంగల నుడికారం ప్రయోగించిన వాడుక భాషా గ్రంథాలు చదివితే చెడిపోరని ఖండితంగా చెప్పారు ఆయన.

భాష ఒక ప్రవాహిని కాబట్టి మారుతూ ఉండటం దాని లక్షణమనీ, కాబట్టి మారేభాషని పట్టుకోటానికి వీలు లేదనీ వివరించారు. (ఆం. ప్ర. సా. అ. సాహిత్యవ్యాసాలు. సం 4 356-362 పే)

నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి :-

ఈవ్యాసం మొదట భారతి రజతోత్సవసంచిక (జనవరి 1949) లో అచ్చయింది. ఇది తరువాత విమర్శగ్రంథ రూపంగా వెలువడినదానికి మూలం. ఇవే విషయాలు విమర్శగ్రంథంలో వివరంగా చర్చించబడినాయి.

కృత్యాద్యవస్థ :-

(ప్రతిభ-నవంబరు 1936) లోకంలో ఏదైనా కష్టమైన పనిచేస్తే కృత్యాద్యవస్థ అయింది అంటాం. అంటే కావ్యారంభంలో పడేకష్టం. అది విఘ్నేశ్వర పూజాదులతో తీరుతుంది. కృతిసమర్పణమనే సంప్రదాయంతో తెలుగుకవులు ఆకష్టంనుంచి బయట పడ్డారు. ఇది సంస్కృతంలో లేనిపద్ధతి. అయితేనేం? తెలుగులోనూ పింగళి సూరన వంటివాళ్లు కృత్యాద్యవస్థకు పాలయ్యారు కాని సంస్కృతకవులు ముఖ్యంగా నాటక కర్తలుపడ్డ యీ అవస్థ శిల్పాచార్యకమా అన్నట్లుంటుంది. అలాగే షేక్స్పియరు, ఇబ్సెన్ వంటి ఆంగ్లకవులు వ్రాసిన నాటకాలు, గ్రంథాలలో ఒక ప్రత్యేకత కనిపిస్తుంది. కావ్యాదిలో ప్రధానోద్దేశం వ్యంగ్యభూతంగా నిక్షేపించి తక్కిన కావ్యం మామూలుగా వ్రాసుకుంటూ పోవడం, కావ్యం ఆకారమంతా ఒక మహార్థానికి వ్యంగ్యరూపంవలె చెయ్యడంవంటి పద్ధతులలో కవికి కృత్యాద్యవస్థయేకాదు, కృతిమధ్యాంతావస్థలు కూడా తప్పవు, వాల్మీకి, వ్యాసుడు వీనికి మార్గదర్శకులు. తరువాత కాళిదాసభవభూతులు తమ శాకుంతలోత్తరరామ చరితాలలో ఇట్టి సృష్టి చేశారు; అని ఈ వ్యాసంలో విశ్వనాథుల సారాంశం.

కృష్ణదేవరాయలు :-

(విజ్ఞానసర్వస్వము 4 సం) విశ్వనాథ వారికి కృష్ణదేవరాయలన్నా అతనిగ్రంథాలన్నా ప్రత్యేక గౌరవం ఉంది. అందుకే 'శ్రీకృష్ణదేవరాయలు వ్రాసిన ఆముక్తమాల్యదా గ్రంథ మాంధ్రభాషకు బనారసు పట్టుచీర. దానినిండ బంగారు పువ్వులే. దానికి వెడల్పైన జరీ అంచు మాల దాసరి కథ. ఆకథ వ్రాయుటతో ఆయన మహాకవి యని చెప్పవచ్చును' అన్నారు.

శ్రీకృష్ణదేవరాయలు ప్రౌఢకవి అనీ, అనగా తాను రచించిన రచనలో బహుభాషాపాండిత్యం, పద్యపుబిగింపు, శబ్దప్రయోగం, ఊహాలోగడుసుదనం, క్రొత్తదనం, సర్వశాస్త్ర పాండిత్యం- ఇవన్నీ రచనలో ఇముడ్చడం అని తెలియచేశారు విశ్వనాథ (762 పే)

సర్వకావ్యాలను ఒకేదృష్టితో చూడడం పనికిరాదంటూ 'కవిత్రయము వారి రచనను చూచినట్లు ప్రబంధకవుల రచన చూడరాదు. కవిత్రయముతో పోల్చి చూడదగినవారు పోతన భాస్కరుడు మొదలైన పురాణేతిహాసకర్తలు. నాచన సోమనను పోల్చవచ్చును. కాని ఆయన యౌచిత్యము చేత కవిత్రయము వంటి వాడు. రసముచేత ప్రబంధకవులకు దగ్గరి వాడు. ఒక విశిష్టమైన ప్రబంధ ధ్వని కల్పనాశక్తియందు పెద్దనగారివంటివాడు. తక్కిన కావ్యము లన్నియు వేరు వేరు గుణములుగ చూడవలయును. అట్లు చూచినచో ఆముక్తమాల్యద వంటిగ్రంథ ముండియే. ఇచట నౌచిత్యాది పరిశీలన, కథాకథన శిల్పవిచారణ పాత్రములతీర్పు మొదలైనవిషయములుపొగొట్టుకొనరాదు. అవియు నుండవచ్చును. వానికి ప్రాధాన్య వివక్ష తక్కువ. ప్రతిపద్య మొక్క భావము. ఆ భావమును చక్కగ గ్రహించి యాయూహయందు, నాపద్య రచనయందు, నాకల్పనయందు భావుకుడు రమించవలయును. అట్టి రమణశీలురయిన భావుకబాహుళ్యము చేతనే యాముక్త మాల్యద నిలచినది (ప 863) అని వివరించారు ఆయన.

ఆంధ్రభాషలో శబ్ద ప్రధాన రచనా వైశిష్ట్యం కలవారు నాచనసోమన, శ్రీకృష్ణదేవరాయలు, తెనాలిరామకృష్ణుడు అనే ముగ్గురే అని విశ్వనాథుల గాఢ విశ్వాసం.

అట్లే 'కవిత్రయమును' నాచన సోమన్నను, పెద్దనగారిని వదలినచో నాంధ్ర కవులందరు పద్యగ్రథన కౌశలవశులు గాని రసభావానుకూల రచనా రమణీయ శిల్పమార్గగులుకారని తన ధ్వనిచేతృత్వమును ప్రదర్శించారు. (776 పే)

నన్నయభట్టు :-

(విజ్ఞానసర్వస్వము - సం 4) సత్యనారాయణ గారు నన్నయమీద ఎక్కువగా

పరిశోధన చేసినట్లు కనిపిస్తుంది. అందుకే ఆయననిగురించి ఎన్నివ్యాసాలు వ్రాసినా ప్రతిదానిలో ఏవో కొన్ని విశేషాలు చెప్పటం, వాటిని సోదాహరణంగా వివరించడం ద్యోతకమవుతుంది.

ఈ వ్యాసంలో నన్నయ మహాధ్వని రహస్యవేత్త అనీ, అలంకార వస్తు రస ధ్వనులు మూడింటిలో శిల్పదృష్టితో చూచినట్లయితే కథాగతమైన వస్తుధ్వని నన్నయగారిలో ఉన్నంత మరి ఏకవిలో లేదని ఖండితంగా చెప్పారు విశ్వనాథ. (పే. 864)

నన్నయగారు 'నానాపురాణ విజ్ఞాన నిరతుడు. నలచరిత్రలో హర్షుడికికాని, శ్రీనాథునికిగాని హంసవిషయం గూర్చి శివపురాణాంతర్గతమైన కథ తెలియదు. ఆహుకుడు, ఆహుకి అనే భిల్లదంపతులు శివుని సేవించి అనుగ్రహం పొందగా, శివుడు 'మీరు భవిష్యత్కాలంలో నలదమయంతులుగా జన్మించినపుడు నేను మీకు దౌత్యంచేస్తా'నని వరమిచ్చాడు. అందుచేత శివుడు హంసగా వచ్చాడు. పరమయోగీశ్వరులకు హంసలనిపేరు. ఇది నన్నయగారి పరమజ్ఞానము.

అంతేకాదు. 'అమలిన......విధాతృలైనను నేరబోలునే ?' అనే పద్యాన్ని బట్టి నన్నయగారు భారతాన్ని చూచిన చూపు తెలియవస్తుంది. (1) ఖగోళశాస్త్ర జ్ఞానం (2) సర్వవేదశాస్త్రముల రహస్యాలు (3) బహ్వర్థయుక్తులు - ఈమూడు విషయాలలో సంపూర్ణత్వం ఉంటేనే గాని భారతం తెలియదంటారు విశ్వనాథ.

'భూసతికిం దివంబునకు...' ఇత్యాది నాగల పద్యంలో భూమ్యాకాశాల దాంపత్యం రూఢమైంది. సప్తర్షిమండలానికి క్రింద కొన్ని నక్షత్రాలు హంసాకారంలో ఉంటాయి. ఆచ్చటే సరస్వతీ నక్షత్రం, బ్రహ్మనక్షత్రం కూడా ఉంటాయి. ఈ సంగతులన్నీ ఋగ్వేదంలో వివరించబడినాయి. కాబట్టి ఖగోళవిజ్ఞాన మహావిషయాలు నన్నయగారికి కరతలామలకములు' (867 పే) అని సత్యనారాయణగారు వివరించారు.

తరవాత నన్నయగారి నుడికారం, ప్రయోగవిలక్షణత్వం సోదాహరణంగా వ్యాఖ్యానించారు ఆయన.

తెనాలిరామకృష్ణకవి :-

(విజ్ఞానసర్వస్వం-4 సం). విశ్వనాథ వారికి అత్యంత ప్రీతిపాత్రులలో తెనాలి రామకృష్ణుడొకడు. ఈవ్యాసంలో రామకృష్ణుని దొక స్వతంత్రమైన శైలి అనీ, దానిలో ఆముక్తమాల్యదా లక్షణాలున్నా దానికంటె భిన్నంగా, రమ్యంగా ఉంటుందనీ, ఆతని సీసపద్యాల శైలి శ్రీనాథుని లక్షణాలు, ఆముక్తమాల్యద యొక్క ప్రౌఢి కలిసి యేర్పడిందని (1003 పే) అంటారు విశ్వనాథ.

రామకృష్ణుని విలక్షణమైన శయ్య ఏ రకంగా ఉంటుందో వివరిస్తూ ఆతని కవిత్వంలో ప్రౌఢితోకలిసి సౌకుమార్యం ఉండటం ఒక లక్షణమనీ, ఆ సౌకుమార్యం (1) భావగతంగా, (2) శబ్దగతంగా సంపాదించ బడుతుందనీ, విశ్వనాథ సోదాహరణంగా విమర్శించారు. ఆతని శైలిలో ప్రధానలక్షణము యమకమనీ అదే తరువాతి కవులు పలువురికి ఒరవడి అయిందనీ అన్నారు. ఇదే విషయాన్ని వి. సర్వ-3సం-పు 1002-1009 లలో 'పాండురంగమాహాత్మ్యం'అనేవ్యాసంలో నొక్కి చెప్పారు.

నాచనసోమన :-

(వి. సర్వ-సం 4) ఈవ్యాసం, దీని తరువాతి వ్యాసం మొదట ఈసంపుటిలో ప్రచురితమయి ఆ తరువాత 'ఒకడు నాచనసోమన్న'లో విపులీకరించబడినాయి.

ఈవ్యాసంలో నరకుడెవడు ? అతనిని చతుర్దశినాడే వధించడం ఏమిటి ? ఆతని భార్యపేరు చతుర్దశియే అవటం ఎందువల్ల ? మొదలగు ప్రశ్నలన్నింటికీ విశ్వనాథవారు సమాధానమిచ్చారు. నరకుడు కూడా ఒకగోళమనీ, శ్రీకృష్ణుడు ప్రాగ్జ్యోతిషము (జ్యోతిస్సునకు ప్రాగ్భవంలో ఉన్నదని అర్థం)నకు వెళ్ళి అంటే ఆకాశమార్గంలో అంతరిక్షం లోకిపోయి ఆ గోళంలాఉన్న మట్టిపెళ్ళను చిదిపివేశాడు. ఈవిధంగా పెక్కు ఖగోళశాస్త్ర విషయాలు విశ్వనాథచర్చించారు (1222 పే)

నాచనసోమన-సంవిధానచక్రవర్తి :-

వి. సర్వ-సం 4). ఈవ్యాసంలో నరకాసురుడు ఊర్వశితో సంభాషించుట అనే 26 పద్యాలఘట్టాన్ని నాచనసోమన విలక్షణమైన మనఃప్రవృత్తిగమనం ఆధారం చేసుకొని తీర్చి దిద్ది ఏవిధంగా సంవిధాన చక్రవర్తి అయిందీ వివరించారు విశ్వనాథ. వారి సూక్ష్మపరిశీలనా దృష్టి వ్యాసం పేరెన్నికగన్నది. నరకాసురుడు నోరుజారటం, ఊర్వశి ఆతని మనస్తత్వ గ్రహించి తన వాక్చాతుర్యం ప్రకటించడం, ఆమె హావభావాలకు లొంగి నరకుడు మోసపోవడం వంటి విషయాల చాలా విపులంగా విమర్శనా చక్షువుతో దర్శించి పరామర్శించారు మనకళా ప్రపూర్ణులు.

తిక్కనగారి శేషత్వము :-

(ఆంధ్ర జనత 21-7-63) రామరాజభూషణుడు తిక్కనను 'కుండలీంద్రుడ'ని వర్ణించాడు. దానికి ఆదిశేషువు, సోమయాజి అని అర్థాలు. శేషత్వంలో యోగలక్షణపరమైన రహస్యాన్ని ఈవ్యాసంలో కవిసమ్రాట్టులు వివరించారు.

(తె. సా. వి-162 పే

(సశేషం

# నా దృష్టిలో గురజాడవారి సృష్టి

— శ్రీ ధూర్జటి వేంకటబాలాజి.

'దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్'

అని ఆధునికాంధ్రసాహిత్యావిర్భావ వేళలలో కోకిలకంటే తీయనైన ఒక గొంతు పలికింది. పలికినపలుకు వాడిగా వేడిగా పఠితలహృదయాలను ఆకర్షించే రీతిలోఉంది. ఇంతకీ ఆగొంతు ఎవరిది ?

ఆ గొంతు విశాఖపట్టణముజిల్లాలోని ఆనాటి ఒకయువకవిది. ఆయన పేరు గురజాడ వేంకటఅప్పారావుగారు.

'అప్పారావుగారు పచ్చికవిగా పుట్టినారు. కవిగా ఎదిగారు, కవిగా రాణించారు. ఆయన పలికిన పలుకును కలకండపలుకన్నా, ఆయన కవితాగానం, కోకిలగానం వంటి దని అందరూ మెచ్చుకొన్నా నేనుమటుకు ఒకవిలక్షణమైన రీతిలో నిజాయితీతోకూడుకొన్న కవితాగానం చేసారని అంటాను. 'ఆయన రాతలు ప్రజాబాహుళ్యానికి ఆదర్శప్రాయాలైనవి. ఆయన జాడలు భావితరానికి మేలిమిజాడలైనవి'అని గంభీరంగా చెప్పడానికి నాకెటువంటి అభ్యంతరమూ లేదు.

గురజాడవారు కేవలం పవహారణాల తెలుగకవి లేక నూరుపైసల అభ్యుదయకవి అని అనడానికికూడా నాకు ఏ అభ్యంతరంలేదు. గురజాడవారు ఒక యుగానికి సరిపడే సాహిత్యసంపదను తెలుగుజాతికి అందచేశారు. ఆసాహిత్యం యీనాటికీ క్రొత్తగానే ఉంది. ఆయన పలికినపలుకు ఈనాటికీ వింతగానేఉంది.

ఇంతకీ తమసాహిత్యంద్వారా గురజాడవారు చెప్పదలచుకొన్న అంశాలేమిటి ? గురజాడవారు కవిత్వీకరించిన ముత్యాలసరాలు, కథకుడుగా నేర్పుతో అల్లగలిగిన 'అణిముత్యాలు' కథలసంపుటి, నాటకీకరించిన 'కన్యాశుల్కం' వంటి నాటకం, యింకా ముద్రిత - అముద్రిత - యితరరచనలు భావితరానికి ఎంతవరకు ఉపకరిస్తాయి? అనే ప్రశ్న సహజంగా ప్రతి సాహిత్యవేత్త హృదయంలో మెదలుతుంది, స్ఫురిస్తుంది. దీనికంటే ముందుగా గురజాడవారు సృష్టించిన యీరచన వెనుక దాగిన ఆయన వ్యక్తిత్వమేమిటో ? ఆయనను అందరూ అభ్యుదయకవిగా ఎందుకు చిత్రించారు? ఆయన తమరచనలద్వారా చూపిన అభ్యుదయం ఏపాటిది ? అన్నవిషయాలను గురించి ప్రస్తావించక తప్పదు.

పందొమ్మిదవశతాబ్ది ఉత్తరభాగం నుండి ఒకపాతికేళ్ళనాటాక తెలుగు సాహిత్యంలో ఆధునికధోరణులు ప్రారంభమైనాయి. ప్రాచీనసంప్రదాయాలపై విసిగివేసారిన తెలుగుకవులు, పాశ్చాత్యసాహిత్య పరిమళాన్ని ఆస్వాదించి విలక్షణమైన రచనలు చేయ నడుంకట్టారు. వీరికి ఆద్యుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు. శ్రీ వీరేశలింగంగారు ఆనాటి సంఘంలోని దురాచారాలను రూపుమాపుటకు సాహిత్యాన్ని ఆయుధంగా స్వీకరించారు. వారికృషిఫలిత గానే తెలుగుసాహిత్యంలో మొద నవల, నాటకం, ఏకాంకిక, ఒక విధం కథవంటి వినూత్న ప్రక్రియా ఉత్త స్థానాన్ని పొందగలిగాయి. అయి కందుకూరివారు ఆధునికాంధ్రసాహిత్ విర్భావానికి మార్గదర్శకులుగానే మిగి పోయారుగాని, పటిష్ఠమైనరచనలు చే తమ మేధాసంపత్తిని నిరూపించుకోలే పోయారు. పైగా ఆయన రచనలు బాల రిష్టదోషాల నధిగమించి, సాహిత్ లోకంలో అడుగుపెట్టుటే గగనకుసుమమైంది. ఒకతీరున పరిశీలిస్తే ఆయ సాహిత్యం సంఘసంస్కరణలకొఱకు నిర్దేశింపబడినందున, సృష్టింపబడినందున మేలిమిరచనలు ఆయనచేతినుండి రాలేకపోయినవి. అందువలననే ఆయన తరువాత వచ్చిన గురజాడవారు సంఘసంస్కరణాన్ని ధ్యేయంగా పెట్టుకొని అభ్యుదయవాదిగా నిలబడి, మేలిమిరచనలు చేయగలిగారు. కారణాలు ఏవైనా గురజాడ మహాకవిగా, ఉత్తమ నాటకకర్తగా, కథకుడుగా, విమర్శకుడుగా సాహిత్యలోకంలో నిలిచారు.

కవిగా గురజాడవారు సాధించిన ఘనవిజయాలేమిటి ? చెప్పదలచుకొన్న

సందేశాలేమిటి ? కవిత్వీకరించిన విధాన మేమిటి ? అని ప్రశ్నలు వేసుకొంటే మనకు సరియైనజవాబులే వస్తాయి. మొట్ట మొదటగా పేర్కొనవలసినవిషయం, తను కవిత్వాన్ని ప్రారంభించడానికి ముందు ఆంగ్లసాహిత్యాన్ని ఆమూలాగ్రంగా పఠించారు. ప్రాచీనాంధ్ర సంస్కృతసాహిత్యాలను క్షుణ్ణంగా అర్థంచేసుకొన్నారు. అయితే ఎటొచ్చీ ఆంగ్లసాహిత్యంమీద మోజువల్లనో, ఆధునికకవిత్వంమీద అభిమానంవల్లనో కాని, ఆయన కవిత్వీకరించినతీరు మటుకు వినూత్నంగా ఉంది. అందులో అణువణువునా అభ్యుదయవాసనలు వెల్లివిరుస్తున్నాయి.

గురజాడవారు కవిగా నిలబడింది కేవలం 'ముత్యాలసరాలు' కావ్యంవల్లనే. ముత్యాలసరాలు ఒకఖండకావ్యం. అంటే కొన్ని గేయాలు కలిపినగుచ్ఛ మన్నమాట వీనిలో 'దేశభక్తి గేయాలు, పూర్ణమ్మ, కన్యక, డామన్ పిథియస్, నీలగిరి పాటలు, ఎత్తులంగరు మరియు ముత్యాలసరాలు.' ఇవన్నీకూడా ఒకవిధమైన గేయచ్ఛందస్సులోనే కొనసాగినవి. వీటన్నిటికి ప్రాణభూతమైనది 'ముత్యాలసరాలు' ఖండిక. అందులో_

'గుత్తునాముత్యాలసరములు
కూర్చుకొని తేటైనమాటల
క్రొత్తపాతల మేలుకలయిక
క్రొమ్మెఱుంగులు జిమ్మగా'

అని పలుకుతారు. 'గుత్తునా ముత్యాల సరములు?' అంటే అర్థ మేమిటి? ముత్యాలతో సరముల్లుట అనుకొంటాను. ఎవరికి ? ఆంధ్రసరస్వతికి కాబోలు. ఏ విధంగా అంటే తేటైనమాటలతో, క్రొత్త పాతలు బాగాకలిసేరీతిలో, క్రొత్తమెఱుగులు చిమ్మురీతిలో. ఇచ్చటనే ఆయన చెప్పదలచుకొన్న ఆధునిక కవిత్వరీతి ఏమిటో అవగతమౌతుంది. ఆఖండికలోనే మరియొకచోట

'మెచ్చనంటా వీవు
మెచ్చకుంటే మించిపోయెను
కొయ్యబొమ్మలె మెచ్చుకళ్ళకు
కోమలుల సౌరెక్కునా ?'

అని నిర్లక్ష్యంగా మాట్లాడుతారు. సాహిత్యలోకం నారచనలు చదివితే ఎంత ? చదవకపోతే ఎంత ? అనే భావం అందులో వ్యక్తమౌతుంది. దీన్ని చదివితే ఎవరోఒక ప్రాచీనకవి అన్న 'నేను ఎప్పుడో ఎక్కడో పుట్టబోయే ఒకవ్యక్తికొఱకు కావ్యాన్ని వ్రాస్తున్నాను!' అన్నమాటలు గుర్తుకు రాక మానవు.

ఇక 'ముత్యాలసరాలు' కావ్యానికి తలమానికము వంటిదిగా 'పూర్ణమ్మ' గేయాన్ని పేర్కొనవచ్చును. పూర్ణమ్మ ఒకరైతుకుటుంబానికి చెందిన ఒక ఆడపడుచు. ఆవిడ కొన్నిసమస్యలకులోనై చివరకు 'దుర్గ'లో అంటే దుర్గఅనే ఆదిశక్తిలో ఐక్యమౌతుంది. ఆవిడ ఐక్యమైన దుర్గదేవాలయాన్ని గురజాడవారు ఈలా అంటారు.

'కొండకునడుమ కోనొకటుంది
కోనకు నడుమ కొలనొకటుంది
కొలను గట్టున కోవెలలోపల
వెలసెను బంగరు దుర్గమ్మ'

దీనిని ఆయన చిత్రమైన భావనకు దర్పణంగా పేర్కొనవచ్చును. పూర్ణమ్మ పుట్టింది రైతుకుటుంబంలోనైనా ఉత్తమ గుణాలు పుణికిపుచ్చుకొన్న ఒక తెలుగు వారిఆడపడుచు. సంప్రదాయ ఆచార వ్యవహారాలంటే ఆవిడకు ఎంతోఅభిమానం. అయితే ఒకవిధమైన మాటపట్టింపుకు, అభిమానానికి లోనై యిల్లువదలి, దేవాలయంచేరి తుట్టతుదకు 'దుర్గలోఐక్యమౌతుంది'. పూర్ణమ్మ చనిపోయిందన్న భావాన్ని గురజాడవారు చిత్రీకరించిన విధం చూద్దాం !

'కన్నులకాంతులుకలువలచేరెను
మేలిమిచేరెను మేలిపసల్
హంసలచేరెను నడకలబెడగులు
దుర్గనుచేరెను పూర్ణమ్మ'

తీక్ష్ణమైన ఆమెచూపులు పట్టుదలను సూచిస్తూ కలువలను చేరాయట. ఆమె నడక హంసనడకవలె నున్నదట. చివరకు ఆమె దుర్గలో చేరిపోయిందట. అంటే ప్రాణాలు కోల్పోయిన దన్నమాటే కదా ! ఆవిడచేసిన త్యాగాన్ని తలచుకొంటే మనకు కట్టమంచివారి 'ముసలమ్మ మరణం' గుర్తుకు రాకమానదు.

ఇదేవిధంగా 'ముత్యాలసరాలు' కావ్యంలో పేర్కొనదగిన మరొకఖండిక 'కన్యక'. ఈవిడ ఒకవైశ్యకులానికిచెందినది. ఒకనాడు ఆవిడ తనకుటుంబంతో పూలు, పండ్లబుట్టలు వెంటతీసుకొనివచ్చే చెలికత్తెలతో దేవాలయానికి పోతూండే సమయంలో మార్గమధ్యంలో ఆ రాజ్యాన్ని పరిపాలించే రాజు కనిపించి ఆమెను వలచి, నిలదీసి తన అభిప్రాయాన్ని వెల్లడించి వివాహం చేసుకొనమని కోరగా కన్యక అందుకు తగిన రీతిగా రాజునకు బుద్ధిచెప్పటకై దేవాలయంలో ఒకసమావేశం ఏర్పాటుచేసింది.

ఆ సమావేశం దేవాలయంలో జరగినందువలన రాజ్యంలోఉండే ప్రజలందరు గుమిగూడారు. అంతేకాక ఆదేవాలయంలోనే ఒకభయంకరమైన అగ్నిగుండం ఏర్పాటుచేయబడింది. అప్పుడు కన్యక తాను ఆనగరప్రజలనుద్దేశించి'అన్నల్లారా! అక్కల్లారా ! ఇంతఘోరం జరుగుతూంటే మీరెలా చూస్తూఊరుకున్నారు. ఈపట్టణమేలే రాజువలన యీరాజ్యంలో కన్యకలు స్వేచ్ఛగా జీవించడానికి అవకాశమేలేదా ? అహంకారి, దుర్మదాంధుడైన రాజును చూస్తూ ఏ ప్రజలుకూడా ఎలా బ్రతుకగలుగుదురు ? ఈ రాజునకుండే కండకావరము ఇంకెవ్వరికి లేదు.

మీరైనా తగురీతిగా బుద్ధిచెప్పండి! వైశ్యకన్యగాపుట్టిననాకు యీరాజ్యంలో అభిమానవతిగా జీవనయాత్ర చేయుటకు ఏమాత్రం యిష్టంపుట్టుటలేదు' అని పలు విధాలుగా రోదిస్తూ ధైర్యంచేసి ఆఅగ్ని గుండంలోకి దూకి చిట్టచివరకు తనకు తానే ఆత్మార్పణం గావించుకొన్నది. ఈ సంఘటన యావన్నగరప్రజలను దిగ్భ్రాంతులను గావించినది. స్త్రీ సౌశీల్యానికి, త్యాగనిరతికి, అభిమానమునకు 'కన్యక' ప్రతీకగా నిలుస్తుంది.

ఇంక 'ముత్యాలసరాలు' కావ్యంలో పేర్కొనదగిన గేయాలలో 'ఎత్తులంగరు డామన్ పితియాన్, నీలగిరిపాటలు' వంటివి ముఖ్యమైనవి. వీటన్నింటిలోకూడా ఆయనకుగల అపారపాశ్చాత్యసాహిత్య పరిజ్ఞానం వెల్లడియౌతుంది. ఇకదేశభక్తి గేయాలలో –

'దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టిక
గట్టిమేల్ తలపెట్టవోయ్ !'

ఆమాటలవల్లగురజాడ వారి దేశభక్తి, జాతీయభావం వెల్లడియౌతాయి. అనవసరమైన ప్రసంగాలను కట్టిపెట్టి, నలుగురికి ఉపయోగపడురీతిలో కవితనల్లమని ఆయన ధ్యేయం. కులమతాతీతమైన అభ్యుదయవాదిగా –

'మంచియన్నది మనజులంపున
ఎంచిచూడగ రెండెగుణములు
మంచియున్నది మాలయైతే
మాలనే అగుదున్'

వంటి ప్రస్తుతమాటలలో సాక్షాత్కరిస్తారు. కాని కొందరు సాహిత్యవేత్తలు ఆయన రచనలలో కనిపించే అభ్యుదయం, ముందుచూపు నిజజీవితంలో లేదని చెప్తుంటారు.

(సశేషం)



## వలపు చిలుక

– శ్రీ తంగుడిగె శ్రీధరరావు,
బి.ఎ., బి.ఓ.యల్.

నిన్నటి చంద్రికాధవళ
 నిర్మలరాత్రిని ప్రేమమూర్తివై
మన్ననతో రసార్తమృదు
 మంజులవాక్కులతో మదీయ భా
వోన్నయముం బొనర్చితువ
 కొక్కపరిన్ మఱికన్మొరంగి యిం
గన్నవలా ! వలంపుఁబడ
 ద్రోచితె ? నన్నటులేల బాసితే ?

కన్నుల వత్తు లద్దికొని
 కాలమునీడ్చుచు నీదుప్రేమకై
యెన్నిదినంబులైనను ని
 రీక్షణ సేయుచునుండువాడ, కన్
సన్నలనైన నన్ గనవు
 సౌమ్యతయొప్పగ, మీననేత్రి ! నా
కన్నుల మీనమాచుఁబడి
 గాసిలజేయుట నీకుఁ బాడియే !

హారివాక్సుధాపూరంపుకీర మీవ
సారసంగీత సత్కళాధారమీవ
మారదారా మనోహరాకారమీవ
చారుశృంగార భావప్రసారమీవ.

ఏలబంగరు సొమ్ములు ? మేలి అవయ
వములునైసర్గికాభరణములు నీకు
పెద్దకాలము నీరూపు దిద్దుతఱిని
బ్రహ్మతానెన్నియుగములు బాధపడెనో।

ఎన్నిజన్మములెత్తిన నెన్నిమారు
లెన్నియత్నముల్ సలిపిన నిందుబోడి !
నిన్నువడయునదృష్టమ్ముకన్న మిన్న !
భాగ్యమనయున్నదేయున్న? భ్రమయె గాక!

కలనొకకామిని గన్పడ
కలరూపునుబొగడినాడఁ గమనీయముగా
వలపుంజిలుకని దానిని
వలపుంజిలుకను గుఱించి వలపుంజిలుకన్.

......

# గ్రంథ సమాలోచన

## కుందమాల

(అనువాదము – శ్రీ డా. పోన్నకంటి హనుమంతరావుగారు. మారుతీ బుక్ డిపో. గుంటూరు. 3. వెలరు3–75.)

ఆదికవియగు వాల్మీకి మధురమఫణితులకు మార్గదర్శియైన మహర్షి. ఉత్తర రామచరిత్ర, ఆశ్చర్య చూడామణి, కుందమాల మున్నగునవి యట్టిమార్గములలో కొన్ని. వానిలో కుందమాలకు గల స్థానము విశిష్టమైనది. దాని వైశిష్ట్యమునకాకృష్టులై పలువురు దాని నాంధ్రీకరించిరి. శ్రీపోన్నకంటి హనుమంతరావుగారొకరు. వీరు ఎం.ఏ; పిహెచ్ డి పట్టముల నందినవారు. కుందమాలను యథాశక్తిగా ననువదించిరి. ఇందు ముద్రారాక్షసములు పెక్కుభంగుల గానవచ్చును.

అనువాదము మూలానుసార్యత మగుటకు పరిపుష్టమైన భాషాజ్ఞానము, కవితాదృష్టి, మున్నగునవి యత్యావశ్యకములు. 4 వ, పేజీలోని లక్ష్మణుని మాటలలో 'సుమంత్ర! అతివేగ సంజాతమగు వేగము గల యీతురంగములు.' దీనికి మూలమున 'సుమంత్ర అతిరభస ప్రవృత్త వేగత్వాత్' ఇత్యాదివాక్యము. మూలములోని 'అతిరభస' అనువాదములో 'అతి' హ్రస్వమైనది. దీని యౌచిత్యము విచారణీయము. 5వ పేజిలోని పద్యములో నాలుగవ పాదమున 'వరలెడు నీకుస్వాగతము పల్కెడు చాడ్పున బ్రీతిపెంపునన్' దీనికి మూలమైన 'ఆదాయపంకజ' యిత్యాది శ్లోకమున, అనువాదములోని 'వరలెడు' లేదు. మరియునందు 'గంగానిలః' అని యేకవచనము కలదు. అనువాదములోనది 'గంగావాయువుల్' అయినది. మూలములోని యేకవచనము సీతకు భవిష్యత్తులో రక్షకుడగు వాల్మీకిని సూచింపవచ్చును. కవి యాయుద్దేశముననే 'గంగానిల:' యనెను కాని 'గంగానిలా:' యనలేదు. క్రియాపదము కూడ మూలమున 'ఉపైతి' యని కలదు. అనువాదము చేయుట యన్నచో నిశిత పరిశీలన ముఖ్యము. ఇట్లే 7వ పేజిలోని 'జలకణికాయుతంబులగు, ఇత్యాదిపద్యమున మూలమార్గము భిన్నమైనది. దీని మూలశ్లోకమిది.

తరంగావీజస్తే సజల
కణికాన్ పీతమరుత:
తథైతే సంగీతం దధతి
కలహంసా: కలగిర:
సఖీవ చ్ఛాయేయం రమయతి
పరిష్వజ్యహృదయం
వనే శూన్యేప్యస్మిన్ పరిజన
వతీ వాత్ర భవతీ ॥

దీని కనువాదమిది.

జలకణికాయుతంబులగు
చల్లనిగాలుల వీచు నీ యలల్
కలరవమొప్పహంసములు
కమ్మనిగానము సేయు నీడయున్
జెలివలె గౌగిలించి మృదు
చిత్తమురంజిల జేయు నిర్జన
స్థలమునగూడ నీపరమ
సాధ్విసఖీజన సేవ్యయౌగదా !

మూలమున సీత పరిజనవతిగా చిత్రిత కాగా ననువాదమున మూలచ్ఛాయ సడలి సఖీజనసేవ్యయైనది. మరియు మూలములోలేని 'మృదు' శబ్ద విన్యాసము దేనికి ? పాదపూరణకు గావచ్చును. ఇట్లే 15వ పేజీలోని పద్యము 'పచ్చికమేయ మాని మృగపాళియు గన్నుల నీరు నించెడున్, హెచ్చినశోకభారమున నేడ్చెడు రాజమరాళముల్ శిఖుల్, చెచ్చెర నాట్యమాడె వనసీమను దేవిని గాంచినంతనే, ఫచ్చితమానవాళికిని గోటిగుణంబు మేలు చూడగన్. దీనికి మూలము 'ఏతే వదంతిహరిణాహరితం విముచ్య, హంసాశ్చ శోకవిధురా: కరుణం రుదన్తి; నృత్తం త్యజన్తి శిఖినోపి విలోక్య దేవీం, తిర్యగ్గతా వర మమీ నపరం మనుష్యా:' మూలమును అనువాదమును విభిన్నమార్గములైనవి. మూలములోని శిఖులు నృత్తమును వీడగా ననువాదములో 'చెచ్చెర నాట్యమాడె' కరుణజనకమగు సీతాపరిత్యాగ సమయము నరణ్య దశను లక్ష్మణుడు సోద్వేగముగ జిత్రించు సందర్భములోని దీపద్యము. ఇటనెమళ్ళు నాట్యముచేయు హేతువేమి ? మరియు మూలములోని నాల్గవపాదము పశుపక్ష్యాదులు మనుష్యులకంటె నయము నను సంపూర్ణభావము నిచ్చుచుండగా ననువాదములోని నాల్గవపాదము మూలమువలె గాక పైమూడు పాదములలోని కర్తల నధ్యాహారము చేసికోవలసివచ్చుచున్నది. ఇదేమి యనువాదము ? చెట్టుపేరు చెప్పి పండ్లమ్ముకొన్నట్లున్నది. ఇట్టి వనేకములు.

మరియు 17వ పేజీలోని రెండవపద్యములో రెండవపాదమున 'పసుడగు రామచంద్రుడు డెడబాయుగ తన్నిట నొంటిచు కడునో' ఇటనర్థముకూడ దురవగాహము. తప్పొప్పులపట్టిక యున్నచో పాఠకునకు

# శ్రీ వాణీ సమాన వర్ణనం

- శ్రీ విశ్రాల శేషాచార్యులు.

సమ్యక్సంపత్తి సంవిత్తి
సమవాప్తి సముత్సుకః
భార్గవీం భారతీం చైవ
స్తవీమి సమ మాదరాత్ ॥

తొయ్యాలి యొకతె చతుర్భుజు నిల్లాలు
మగుదయొక్కతె చతుర్ముఖుని గృహిణి
పడఁతియొక్కర్తుక పతివక్షమునఁ గుల్కు
పతివక్త్రమునఁ గుల్కు పడఁతియొకత
పదవులఁ గల్పించు పద్మాక్షి యొక్కత
చదువులఁ గల్పించు సుదతి యొకతి
లలన యొక్కతి మహీశుల సల్పభక్తుల
శ్రితుల మనీషులఁ జేయునోర్తు
ఇద్దఱును గోశములలోన ముద్దులొలుకు
వారు నానార్థముల నిచ్చువారు వారి
భార్గవీభారతులఁ దుల్యభక్తితోడ
సేవఁ జేసెద నిత్యము సేమ మొదవ.

శంఖ చక్ర గదాఢ్యశయయోర్తు,యోర్తుక
గ్రంథవీణాక్షమాలాంచత్కర,
సౌదామినీలతాచారుగాత్రి యొకర్తె,
చంద్రికాసిత గాత్రి చానయోర్తు,
విహగరాజును నెక్కి విహరించు నొకొతిక
రాజహంసము నెక్కి క్రాలునొకొత,
శతపత్రకాముక సాధ్వీమణి యొకర్తి,
శతపర్వకాముక సతి యొకరితి,
ఇద్దఱు సువర్ణలేఖాసమింధమాన
వపువుల వెలుగుచుండెడువారు, వారి
భార్గవీభారతులఁ దుల్యభక్తితోఁడ
సేవఁ జేసెద నిత్యము సేమ మొదవ.

భుక్తిముక్తిప్రద భూతలి నొకరితె
సిద్ధిబుద్ధిప్రద క్షితి నొకరిత,
శ్రుతులచే నొక్కర్తు స్తుతయౌచునొప్పెడు
శ్రుతులనొక్కతి చమత్కృతిగఁ బాడు
నిత్యలోకేశ్వరి నీరజాక్షి యొకొర్త
సత్యలోకేశ్వరి సతి యొకర్త,
పుట్టెఁ గమలమందు పొలఁతిక యొకతిక
కమలమ్ము మెట్టె నొక్కరిత గరిత,
కలికి యొక్కరితె దిక్కరిసమాప్లుత,దివ్య
హంసవీజితయోర్తి హరిణనేత్రి
వినతచారిత్రయొక్కతె విధుపురంధ్రి
విమలచారిత్ర యొక్కతె విధిపురంధ్రి
భార్గవీభారతుల వారి భక్తితోఁడ
సేవఁ జేసెద నిత్యము సేమ మొదవ.

ఇతివిశ్రాల శేషార్య
కవివర్యకృతం శుభం
భార్గవీ భారతీస్తోత్రం
జీమూతత్ప్రీతి వర్ధనమ్॥

—0—

( 19 వ పేజీ తరువాయి )

గొన్ని ముద్రారాక్షసములను బరిహరించు గొన వీలయ్యెడిది. 18వ పేజిలోని పద్య భాగములో చివర – 'భూపుత్రి' యనుట ప్రకృతోపయోగికాదు. మూలములో 'రాజపుత్రి' యని కలదు. అక్ష్మణుడు సీతను గంగాదుల కప్పగింత వెట్టుచు నామె సౌకుమార్యద్యోతనకై 'రాజపుత్రి' యని పలుకగా ననువాదకులు, భూపుత్రి యనుట నామె సహనశక్తిని వెల్లడించుచు ప్రకృతభంజకమగుచున్నది. 22వ పేజిలో 'జనకరాజు చిరకతనసఖుడు నాకు' ఇట క్రీగీటుపదము విచారణీయము. మరియు దీనిలోని నాల్గవపాదము మూలోత్కర్షను విడిచినది.

ఇట్లే 25 వ పేజిలోని వేదవతిమాటలలో 'ఆ వృత్తాంతము వినిన తరువాత ఇంతదనుక సీత కృతపుణ్య యని భావించుచున్నాను.' ఇట మూలమున 'ఇమం వృత్తాంతం శ్రుత్వా ఏతదర్థం సీతా కృతపుణ్యేతి తర్కయామి'. మూలములోని 'ఏతదర్థం' అనువాదములో 'ఇంతదనుక' యైనది. ఇది యెట్లు పొసగును. 28 పేజిలోని సీతావాక్యము తరువాత (అతని హృదయము సీతకు పరకీయ మెట్లగును?) 'అహో అపరిత్యక్తానురాగ తా' యను వేదవతీవాక్య మనూదితము కాలేదు. ఇట సీతమాటలు వేదవతివిగా నుంచబడినవి. 55 వ పేజీలో 'రాముడు నవ్వి – ఇందాశ్చర్య మేమి? తరువాత 'మునీనాం సామగీతాని పుణ్యాని మధురాణి ప్రవాసినా మపి మనో హరంతి కిము దంతినాం' అను శ్లోకము అనువాదములో విడువబడినది. కారణ మనూహ్యము'

52 వ పేజిలోని కందపద్యములో 'కానన రమణీయత గనదు నేత్రరాజీవములన్' ఇది దురవగాహము. రాజీవములై యుండును.

మొత్తము చూడగా ననువాదములో మూలముకంటె పదభావాదుల యందు విభేదములు పుష్కలముగా నగపడును. ఇట్టి యనువాదము వలని ప్రయోజన మేమి? మూలకథాజ్ఞానము సంస్కృతానభిజ్ఞులకు గలుగవచ్చును. అనువాదమునకు వలసిన సామగ్రిలోపము స్పష్టమగును. అనువాదకులు మరింత యత్నించి శ్రద్ధాళువులై నిర్వహించినచో కొంతకు కొంతయైన బాగుండెడిది. వీరికి గల సంస్కృత రూపకాను వివదిష మెచ్చదగినది. వీరు మరింతగా కృషిచేసి మరిన్ని సంస్కృత రూపకముల నాంధ్రమున రూపొందింతురని పాఠకు లాశింపదగును.

- శ్రీ ప్రసాద్.

# ఈపక్షంలో

## శ్రీ వీరేశలింగ స్మారకోపన్యాసము

25-2-79 ఆదివారం సాయంకాలం 6 గం॥లకు రాజమండ్రి వీరేశలింగ పుర మందిరమున సాహిత్యసభ జరిగినది. శ్రీ ఆచార్య దామెర్ల వెంకటరావుగారు సభకి అధ్యక్షత వహించిరి. శ్రీ పోతుల వీరభద్రరావుగారు మాజీ ఎం. ఎల్. ఏ. అండ్ మునిసిపల్ చైర్మను సభాప్రారంభము గావించిరి.

కాకినాడ M. S. N ఛారిటీస్ కాలేజి ఆంధ్రోపన్యాసకులు శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారు 'సాహిత్యమును సంఘసంస్కరణమునకు ఆయుధముగా ఉపయోగించుకొనుట' అనే విషయమును గురించి ఉపన్యసించిరి.

'వీరేశలింగముగారు సంఘసంస్కరణమునకై సర్వాత్మనాకృషిచేసి అనేకకష్టములను ధైర్యముగాఎదుర్కొన్నవీరుఁడు. గద్యతిక్కన బిరుదునొందిన వచనరచ ...త. అనేక సాహిత్య ప్రక్రియలలో ...వన కాద్యుఁడు. అయినను రసప్రధాన ...హిత్యసృష్టి అతని ప్రధానలక్ష్యము ...దు. కాబట్టి గురజాడ రచనలలోని ...ల్పము, ఉత్తమస్థాయి వీరేశలింగరచనలకు కలగలేదు. ఇప్పటికీ సాహితీరంగమున ఆతనిని స్మరించుకోవడానికి కారణమాతనివ్యక్తివైశిష్ట్యము.

వీరేశలింగసంఘసంస్కరణము అంటే నితంతు వివాహనిర్వహణ మొక్కటేఅని ప్రసిద్ధివెలయుట సబబు కాదు. లంచగొండితనము, మూర్ఖాచారనిరసనము, జమీందారు ధనికుల ఆడంబరమును నిర...ంచుట మున్నగు అనేకరంగములలో ...యన కృషిచేసినందున సమగ్ర సామాజిక వాదిగా ఆయనను భావింపవచ్చును. దయ్యములు లేవని నిరూపించుటచేత ఆయన నాస్తికుఁడని చెప్పవచ్చును. ప్రాచీన కవులలో సా... మున్నను 20వశతాబ్దపు సామాజికదృక్పథానికి దానికీ భేదముగలదు. ఇది సమగ్రమైనది; అది అత్యల్పమైనది.' అని ప్రసంగించిరి. ఇతర విషయాల మాట ఎలాగున్నా అనేకసందర్భాలలో భగవంతుని కరుణామయత్వమును కొనియాడిన వీరేశలింగము నాస్తికుడనుట సాహసమే యనవచ్చును. వీరేశలింగాస్తిక ఉన్నతపాఠశాల,ఆస్తికకళాశాలలు, ప్రార్థన సమాజములు నేతిబీరకాయలే యనుట సమంజసమా ? అనిపించినది.

## గౌతమీ గ్రంథాలయము ప్రభుత్వ స్వీకారము

అనేకదశాబ్దములనుండి పేరుప్రతిష్ఠలు గలిగి వేలకొలది అమూల్యములైనముద్రిత గ్రంథములతోను తాళపత్రగ్రంథములతోనువిలసిల్లి అనుదినము లెక్కకుమిక్కిన పాఠకుల ఆదరాభిమానములకు పాత్రమై అనేక పరిశోధకవరేణ్యులకు సహాయకారియై రమారమి ఐదాఱులక్షల విలువ గలిగిన రాజమండ్రియందలి గౌతమీ గ్రంథాలయము తాత్కాలికాధ్యక్షులు శ్రీ రెవరెండు ప్రశాంతకుమార్ ద్వారా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వప్రతినిధి శ్రీ సి. వి. సుబ్బారావు, డిప్యూటీ ఎడ్యుకేషనల్ ఆఫీసరుగారికి 19-2-79 న దత్తము చేయబడినది.

దీనిని ప్రభుత్వముస్వీకరించి పరిశోధక కేంద్రముగా (రీజనల్ లైబ్రరీగా) పెంపొందజేయవలసినదని కోరుచు పురప్రముఖులు, గ్రంథాలయసభ్యులు, కార్యనిర్వాహకవర్గమూ రమారమి 2 సంవత్సరములనుండి కృషిచేయుచున్నసంగతి పత్రికాపాఠకులకు రాజమండ్రి వాస్తవ్యులకు విదితమే.

ఉన్నతశ్రేణికిచెందిన యీ గ్రంథాలయపాలకవర్గమున కలతలేర్పడినందున, తగినంత ఆర్థికస్తోమతులేనందున గ్రంథాలయనిర్వహణ అత్యుత్తమముగా సాగజాలని పరిస్థితిలో గ్రంథాలయపాలకవర్గమువారు ప్రభుత్వము స్వీకరించి అభివృద్ధిపరిచేవిధంగా కృషిచేసి కృతకృత్యులైన విషయము ముదావహము. భాషాభిమానులు, వాఙ్మయసేవకులు మహాసంపన్నులైన ఉదారులు, గల రాజమహేంద్రవరనగరము అన్నివిధములా అమూల్యమైన ఈసంస్థను ఉన్నతస్థాయినిర్వహణమున నిలుపుకోలేక ఈవిధముగా ధారాదత్తముచేయుట గర్వకారణముమాత్రము కాఁజాలదు.

---

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూఁతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన లతి దీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు ప్రయత్నించుట మిక్కిలి అవసరము.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

— సంపాదకుడు.


అడ్రసు :—

సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి,

Retired Telugu Lecturer, V. T. J. College,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.


## చందాదారులకు

సమాలోచన మొదటి సంపుటము 1 to 24 సంచికలు 2 వాల్యూములుగా బైండు చేయబడి యున్నవి. రెండువాల్యూమ్సు వెల పోస్టేజీతోసహా రు 18-00 లు ఎం. ఓ. ద్వారా పంపువారికి రిజిష్టర్డు పోస్టులో పంపబడును. వాల్యూములు అతిస్వల్పసంఖ్యలో మాత్రమే ఉన్నవి.

— సంపాదకుడు 'సమాలోచన'


Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.